# శాంతినికేతనము

( చరిత్రాత్మక నవల )

ఉపవాచకము – ఉన్నతతరగతులకు.

గ్రంథకర్త :
విద్వాన్, కొండూరి నరసింహం
ప్రధానాంధ్రాధ్యాపకుడు :
శ్రీ జాపూడి గంగయ్య మెమోరియల్ హైస్కూలు, భీమవరము

ప్రకాశకులు :
ఆదర్శ విద్యామండలి – తెనాలి
సాహితీ విద్యాప్రచారకులు

వెల : రూపాయి

# శాంతినికేతనము

## ౧

అది పరమపావనమైన యాశ్రమభాగమని జనులలో వాడుక. లోని విషయమేమియో, ఎవరు నివసించుచుందురో, ఎట్టి క్రియ లాచరింపఁబడుచుండునో, పరిసరములఁ జెప్పఁగల్గినవారు లేరు. వింధ్యపర్వతోపత్యకలలో ప్రకృతిరమణీయమైన భూభాగములలో, సెలయేటిదరిని జెలువారు నయ్యాశ్రమము కేవల మాకుజొంపములచే నిర్మింపఁబడినట్లు దృగ్గోచరమగుచు, లలితసుమలతాపుంజములఁ బుంజీభవించిన శాంతిమూర్తివలె వెలుఁగొందుచుండుటనో నిజమైన శాంతిదూత యొకం డట యుండియుండుటనో "శాంతినికేతనము" సార్థకనామమువోలెఁ బరిసరవాతావరణమున యశఃకాంతుల నిండించుకొనినది. నాల్గువైపుల రెండు మూఁడు కోసుల దనుక పల్లెటూ రొక్కటేనియు లేకుంటచే నియ్యాశ్రమంబును గురించి నీలివార్త లేకాని నిజవార్తలు లేవు.

పతనోన్ముఖమైన పావన హిందూమతంబు నుద్ధరించుటకు భగవానుఁ డొక మహర్షివోలె నట నవతరించె ననియు, వానికిఁగల శక్తు లపరిమితములనియు, క్రూరజంతువు లన్నియు నమ్మహర్షి యాజ్ఞానుసరణమునఁ బ్రవర్తించుననియు రైతు లనుకొనుచుందురే కాని స్వయముగఁ గనుఁగొన్న సాహసి యెవ్వఁడును గనరాఁడు.

దేశమున నరాజకము ప్రస్ఫుటించినట్లు హృదయబాధ నందుచుండిన పల్లెసీమల నిట్టి వార్త లనవరతము చర్చింపఁబడుచుండుట, ఒక రిద్దరిచే సిద్ధాంతీకరింపఁబడుచుండుట సహజమయ్యెను...

అది నిండు పున్నమదినము. వెనువెంటనే వ్యాపించిన వెన్నెల వాకలలోఁ దేలియాడిన లోకము సూర్యుఁ డస్తమించుట యెఱుఁగదు. నిర్జనమైన యటవీభాగము కలిగిన యాహారమును బసిపిల్లల నోటి కందిచ్చుచుండఁ గన్పడి పులుఁగుల కలరవము తప్ప, ప్రకృతి నిశ్శబ్దమునకు భంగమును జేయు నొండు విషయ మచ్చట లేదు. ఇంతదనుక పుష్పమధు వాస్వాదించిన భృంగరాజములు విశ్రమింపఁ జనుటచే వాని ఝుంకృతుల స్థానమున నప్పుడప్పుడు కీచురాలు గొంతు కలుపుకొనుచున్నవి. ఏ పొదలో నేమున్నదో తెలియదను సామెత కనువగు భీకరమైన నికుంజములు చూపఱులకు భీతిఁ గొల్పు చుండెను. మిణుఁగుఱుల మెఱపులో, వ్యాఘ్రముల నేత్రములో, మణుల కాంతులో, దూరమునఁ బొదల మీఁదుగాఁ బర్వతాగ్రముల దనుక కన్పించుచున్నవి.

అట్టిచో... టకటక యను శబ్దము నిశ్శబ్దమును జీల్చుకొని సమీపించుచున్నది. ఏమది? అశ్వరాజము నధిరోహించిన యువకుఁ డొకఁడు శరవేగమున వచ్చుచుండెను. త్రోవ- తెన్నులులేని యా పర్వత భాగములఁ బర్విడు తురగము ప్రాంతకాలమునఁ బరిచయమున్న దానివలె సంశయములేక సాగిపోవుచున్నది... ఆ యువకుని జూచిన నట్టిభావమే జనించును. తలను బాగయు, నడుమున వ్రేలు ఖడ్గమును, బొడగాంచిన నతఁడొక యుద్ధవీరుఁ డనిపింపక మానదు. ఆ వెన్నె లలోఁగూడ నాతని చిఱుమీసలు శౌర్యపుఁ బొగలనే చిమ్ము చున్నట్లున్నవి.

... వాని గమనము గంభీరముగ శాంతినికేతనముననే ప్రవేశించెను. లోన...చిన్ని చిన్ని యాకుపాకలు...ముందు వేదికలు... ముందుఁగల పర్ణశాలలో నప్పుడ జపమును ముగించెను గాఁబోలు

నా వృద్ధమూర్తి జపమాలికను గంతమున వైచికొని, విడివడిన కేశపాశ మును బంధించుకొనుచుండెను. సన్నని దీపపు వెల్గులను ముంచెత్తి వైచు నా బ్రహ్మతేజస్సును నలువైపులఁ బ్రకటించుచున్న వేద మూర్తికి వచ్చిన యాశ్వికుఁడు సాష్టాంగ మొనర్చి "జయ్ భవానీ" యని సాంకేతికముగ నినదించెను.

వృద్ధుఁడు వానిని లేవనెత్తుచు "రఘూ! క్షేమమా? శ్రీ శివరాజు ప్రమాదభరితుఁడు కాఁడుగదా! మన దుర్గముల నల్ల కల్లోలములు మాయమైనవా?... ప్రశ్నపరంపరలు కురిసెను.

గురుదేవా! నాసేమమున కేమిగాని శ్రీ శివాజీ మహారాజు లిచ్చిన యుత్తరము లివిగో... పరిశీలింపుఁడు. ప్రస్తుతమునకు దుర్గ ముల నల్లరు లేవియు లేవు. పరిస్థితియంతయును సముద్రగర్భమున నణఁగియున్న తుఫానును బోలియున్నది. భావికాల మెటులుండునో గురుదేవులే వచింపవలయును... రఘు సానునయముగ వచించెను.

దగ్గఱనున్న చిన్ని దీపికసాహాయ్యమున గురుదేవుఁడు పత్ర ములఁ బరిశీలించుచుండెను. రఘు తన యంగరఖాను, పాగాను, తీయు చుండఁగనే సమీపమున నొక హస్తము రెండుపాత్రముల నీరు నుంచి మాయమయ్యెను. ఒకటి పాద్యము... మఱియొకటి పానీయము... ఈ దృశ్యము మన రఘూబాకుఁ గ్రొత్తకాదు. ఆ కోమల కిసలయ హస్తము లెన్నిమాఱులో మన యువకునికి దర్శనమిచ్చియున్నవి. కాని యామె విగ్రహమును జూచియుండలేదు. అట్టి వాంఛయు జనించియుండలేదు. అప్పుడప్పుడు శ్రీ శివాజీమహారాజు లాజ్ఞాపించు టయు, రఘు గురుదేవులను దర్శించి ప్రత్యుత్తరములఁ గొని చను చుండుటయే కాని మిగిలిన ప్రశ్నలేవియు వానిని బాధింపలేదు.

గురుదేవుల నామము "జనార్దనదేవు" లనియు, అంబరరాజా జయసింహుని యాస్థాన విద్వాంసులనియు, కారణాంతరముల నీ పర్వతసీమలనుండి శ్రీ శివాజీ వర్గమునకు సహాయ సంపత్తులఁ గల్పించుచుండిరనియు మాత్రము మన యువకునికిఁ దెలియును. "వ్యర్థములైన యుద్ధములేల? ఢిల్లీపాదుషాల కనువర్తులమై యుండిన మనకును సుఖము. ప్రజకును సుఖము. కాన వానితో సంధికొడంబడుదము" అని జయసింహుని వాదమట. పౌరుషములు, ప్రతిభలు, ప్రతిష్ఠలు, కాలానుసరణముగ నందఁదగినవే. కాని ప్రతిజీవికి నివియుండవలయు ననుకొనుట యపహాస్యకరమని వాని విచారమఁట. ప్రభువు లెవరైననేమి? ప్రశాంతస్థితి యుండవలయునని వాని వేదాంతమట." పరంపరాగతమైన స్వారాజ్యమును బోనాడుకొని, విజాతీయుల పాద దాస్యమున కొప్పుట మనపని కాదని జనార్దనదేవుల ప్రతివాదమట. దానితో... పాదుషాకు లోఁబడి వాని సర్వసైన్యాధినేతగా నుద్యోగమందు ప్రతినతో జయసింహుఁడు ఢిల్లీకిఁదరలుటయు, జాతీయసైన్యమునకే కర్ణధారులమై ప్రాచీనసంప్రదాయ ధర్మసింధువునే తరింపఁ జేయుదమని గురుదేవు లిటవచ్చి యీ కందరముల నివాసమేర్పఱచుకొనిరట!

"అమ్మా! సరయూ! ఆహారముఁగూడఁ ద్వరగాఁ గొని రమ్ము. ఉదయమున రాజకోటలో బయలుదేరిన వాఁడు... పాపము! చాల యాకలిఁ గొని యుండును." గురుదేవుల యాజ్ఞ యిది. శాంతినికేతనమున భోజనమును, రాత్రి విశ్రాంతియు రఘుకు నేఁడు లభ్యమైనవి. వచ్చిన ప్రతిపర్యాయము నే రెండు మూఁడు గంటలో యుండి ఫలాహారమనుభవించుట వినా వాని కవకాశము లేకుండెడిది. ఇచ్చట ... జనార్దనదేవుని దప్ప రఘు మఱెవ్వండు నాశ్రమవ్యక్తి

నెఱుఁగఁడు. గురుదేవుని సాన్నిధ్యము నంది రణవిద్యయందే కాక రాజనీతియందును, సకలకళాకౌశల్యమునందును నిపుణులై, పవిత్ర భారతోద్ధరణకు బద్ధకంకణులై దేశవ్యాప్తినందిన వీరాధివీరులు లెక్కకుమించియుందురని రఘు వినియుండెను. కాని...ఆతఁడెన్నఁడును లోపలి యాశ్రమభాగములఁ గాంచినవాఁడు కాఁడు. ఇట్టి యాశ్రమములయందు స్త్రీ మూర్తు లేమి చేయనుందురో యాతఁడెన్నఁ డూహించినవాఁడును గాఁడు. అగుచో...ఈమె యెవరు? జనార్దనదేవుని సతీమణి పరమపదించి పదేండ్లకుఁ బైనయ్యెనంట రే... సంతానమునుగనని వీరికి మఱియెట్టిసంతేని లభించునా?

పత్రముల నన్నిఁటిఁ బరిశీలించిన గురుదేవులు సాభిప్రాయముగా సన్నని దగ్గుదగ్గిరి. రఘు సచేష్టుఁడై గురువుల మొగమాయెను. ఆహారమును వేదికపై నుంచిన సరయూబాల యదృశ్యమయ్యెను.

నాయనా రఘూ! భోజనమును జేయుచుండుము. విషయమును వివరించెదను.

రఘు తత్ప్రయత్నమున సిద్ధుఁడయ్యెను. ఒక్కొక్క కబళమునే మ్రింగుచున్న రఘుకెదురుగ నాసీనులై గురుదేవు లనుచుండిరి.

రఘూ! ప్రమత్తుఁడవు గాఁబోకుము. శ్రద్ధతో నాలకించుము. నా యీ వార్తక మెంత పరితప్తమగుచున్నదో పరికించుము. కొండదేవునివంటి వానికి శిష్యుఁడైన శ్రీ శివాజీమహారాజు సహస్రవర్షములు వర్ధిల్లునుగాక...మాతృ శ్రీ జిజీబాయి రక్షాబంధన మాతని ననవరతము నోమునుగాక...సమర్థ రామదాసుల సార సహిత ప్రబోధ మాతనికి మంగళములఁ జిలికించును గాక...ఇయ్యవి యొకరి యాశీస్సులు కావు. బాధాసముద్ర పతితులైన కోటానుకోట్ల హిందువుల

వాంఛ యిది. వారి హృదయాక్రందనము మిన్నుముట్టుటనే శివాజీ బోలు శివావతార ముద్భవించెనందును. విజాతీయుల దారుణదౌర్జన్యముల నలిగి నామరూపములు లేకుండ మనమందఱము సమసిపోవలయునని యా భగవంతుని యభిప్రాయమా? రాజ్యకాంక్షతోఁబాటు సంఘ సంస్కారణములకుఁ గూడ నుద్యమించిన ప్రభువుల బుద్ధిబలము నేమందము... కానిమ్ము...

గురుదేవు లాయాసమున రెండునిముసము లాగిరి.

శివాజీని మట్టుఁబెట్టుటకై నూత్నయత్నము లారంభమైనవి. పత్రములయందు వ్రాయబడినంత ప్రశాంతత వాతావరణమునఁ గానరాదు. ఢిల్లీపాదుషా మనఃప్రేరితుఁడై వాని దగ్గఱబంధువు శైస్త ఖాను మహారాష్ట్రుల మట్టిఁ గలిపెదననుచు సమస్త సహాయ సంపత్తులతోఁ బూనాలో మకాము వైచెనని యింత క్రితమే నాకు వార్త వచ్చినది. దీనిని శివాజీ యెల్లెదుర్కొనునట్లు చేయుదువో... విషయములన్నియుఁ బత్రములపై వ్రాసి యుంతును. ఉదయముననే మహారాజుల కందీయుము. ఆలస్యము విషము వంటిది... ఔనా! రఘూ ! సరే.....సరయూ ! రఘూబా కేమి కావలయునో చూడుము.

తిరిగి బాల ప్రత్యక్షమైనది. ఆమెవైచు పదార్థము లమృతమయములై యుండుట యటుంచుఁడు. వాని స్పృశింప యత్నించు రఘు కరములు పెదవులుకూడ నప్రయత్నముగ వణకుచు రాగారుణ ప్రతిభాసితము లగుచున్నవి.

నాయనా ! రఘూ ! ఎన్ని రాజ్యసీమలు పరరాజుల భయంకరమైన దాడులకుఁ దట్టుకొనలేక, రూపుమాసినవో, బూడిదకుప్ప

లైనవో, నిర్ణయించఁగల వివేకియుండునా ? తల్లికి, బిడ్డకు వేరుఁ జేసి, తనయుని తండ్రిని దూరమొనర్చి, యెడఁబాటు గల్గించిన వీరి యరాజకమునకు హద్దుండెనా ? ఎందఱు కాందిశీకులై, గుప్పెట గుండెల నుంచుకొని, నిజసంపదలను, నిజ దేశములను వీడి యితర ప్రాంతములఁబర్విడిరో ... అబ్బ ... అనవరతమాదృశ్యములుకన్నులఁ గట్టుచున్నవే ... ఆ బిడ్డ ... సరయూ ... ఎవరనుకొంటివి ? రఘూ! భయచేతస్కులై పర్విడు పేదల రక్షింపఁ బ్రాణములిచ్చిన రాజ వీరుని కుమార్తె. తల్లి చిన్ననాటనే లోకము వీడినది. అవసానము నందున్న దురదృష్ట పితృదేవుఁ డీమెను నా హస్తముల నిడి కన్నుల మూసెను ... తురుష్కుల దౌర్జన్యములకు బలియైన వానితండ్రి మరణించి యప్పుడే పదునైదు సంవత్సరములు.

గురుదేవుల నేత్రముల గరుణసముద్రములు కెరటములు వైచి నవి. వాని యనంత గంభీర హృదయము విషాద భావావేశమునఁ గలత నందుట విశాల ఫాలభాగమే వివరించుచున్నది. రఘు నిర్విణ్ణుఁ డయ్యెను.

ఏమి యీమె యాశ్రమబాలిక కాదా ? సుక్షత్రియవంశ సంజాతయా ?

రఘు భావనాచిత్రములు రంగులఁ బూసికొన్నవి. వానిలోఁ గడచిన పరితాప దృశ్యములును గలవు. సరయూబాలకును దనకును నన్నిట సమానత్వ మేదియో వానికి స్ఫురించినది.

"రఘూ ! ఎన్నటికేని యిట్టి యనాథబాలికల యశ్రుపాత మునకుఁదగిన ఫలిత మా దుర్మార్గప్రభువు లనుభవింతురా ? కాంది శీకుల హృదయముల మండెడి మంటలన్నియు నెన్నఁడేని శీతలము

నందునా? వారి జీవితములకు సౌఖ్య సంయోగముండునా? నా కాంక్షయు, నా యాదర్శమును జిగిరించు శుభసమయ మెఱుదెంచునా?"

"అమ్మా! భారతాంబా! చిరంతనసుసంస్కారవతివైన నీకీపాట్లేమి? బర్బరు లెందఱు నిన్నిట్లు హింసించుచుందురు? కూలికి వచ్చి, పాలికి మాట్లాడు నీ విజాతీయ ప్రభువులందఱును నిన్ను సుఖపెట్టుటకే వచ్చియుండిరా? కన్నబిడ్డ లందఱును గడగండ్ల పాలై, దిక్కుమాలి పరిభ్రమించుచుండ నేతల్లి వీక్షింపఁగలదు? ఇట్టివి సహించుటకే రాతిగుండెయో వలయునుగాని నినుబోలు కరుణరసమూర్తులోపఁగలరే? చతుర్వేదములు, సమస్తశాస్త్రములు, సకలధర్మములు, తలసూపిన నీలో నిట్టి పాపు లెన్ని దుఃఖముల రేకెత్తించుచుండిరి? దీనికి హద్దు...ఒక్కటే...ఒకఁడే...మా శివాజీ మహారాజు వినా యితరులు నీ కన్నీరుఁ దుడువను లేరు... నీ కోదార్పు నీయను లేరు.

రఘు భోజనమును ముగించెను. గురుదేవు లుదయమునఁ గలిసికొందమనియు, రఘు నా పూఁదోట చప్పరముపై నిద్రించు మనియు జెప్పి హోమశాలలోఁ బ్రవేశించిరి.

రెండడుగులు ప్రక్కకేఁగిన విశాలమయిన వనభాగమది. వివిధఫలవృక్ష లతా సమన్వితమగు నా తోటలో నడుగుంచిన రఘు నందనవన ప్రవేశమని యానందించెను. ఒకచోఁ గదళీవృక్షములు. వేఱొకచోఁ బరిమళముల గుబాళించు సన్నజాజులు; వెన్నెలలోఁ జూడ గన్నులపండువై యాతఁడు చాలసేపందందుఁ దారాడుచునే యుండెను. నిష్కళంక మనస్కుఁడగు వాని హృదయమున నొండు భావము లేదు. సరయూబాల విషయ మతఁ డన్యము నూహింప

లేకపోయెను. అవివాహితుఁడయ్యును వాని కితరచింతనము శూన్యము. దేశము... రాజాజ్ఞ... అంతియే... గురుదేవుని భావ గాంభీర్యమునకు లోతులు తీయుట వానికిఁ దరముకానిది.

రాత్రి చప్పరముపైఁ బరుండి నిద్ర నుపక్రమించుటకై, పాద ధూళి వోవఁ బాదముల రెంటిని టప టప కొట్టిన...కొలఁది నిముసములలోనే మైకము క్రమ్మెను. పూల పరిమళముల దిమ్ముపట్టిన తలలో నిద్ర సులభముగాఁ బ్రవేశింప నుండెను.

౨

మిసమిస లాడుచున్న చంపక మొకటి రఘు గుండియలపైఁ బడెను. అయ్యది కనుఱెప్ప పాటులో నే విచిత్ర సందేశము నిచ్చెనో...వానిహృదయము జాగృతి నందినది. రఘు కనులువిప్పి చూచుసరికి నభోవీథిని శశికుమారుఁడు నవ్వుచుండెను. మేఘశకల మొకటి వానిఁ బరిహసింపుచుఁ బ్రయత్నవేగమున దూరము పరువిడుచుండెను. నక్షత్రములన్నియుఁ గన్నుల విప్పి సంభ్రమమున వీక్షించుచున్నవి. ఎలమావి గున్నపైఁ గోకిలయు నెదియో వార్త నిచ్చుచున్నది.

రఘు ముందునకుఁ జూచెను. నాల్గడుగులలో నిలిచి యున్న సరయూబాల వనకాంతను భ్రమింపఁ జేయుచుండెను. ప్రశ్నార్థకముగ నిలువఁ బడిన సరయూబాలను జూచి రఘు వచ్చెరువందెను. ఏమిపనిఁగాని వచ్చినది? ఏరీతిఁ బలుకరింపవలయును ? ఏమిచేయవలె?

వీరశిరోమణీ! ఆశ్చర్యపడుచుంటిరా ? 'అనుజ్ఞ లేనిదే సాహసించి వచ్చిన నా మనశ్చాంచల్యమును క్షమింతురుగాక ... ఆమెయెం మధుర ధ్వనిలో మాట్లాడినది.

రఘు చెవుల కేదియో మంత్రము సోకినటు లున్నది. అయ్యును బ్రతివచనమునకు భాషయే స్ఫురణకు రాలేదు. అతఁడు లేచి నిలువఁబడెను.

సరయూబాల దగ్గఱకు వచ్చి వాని రెండుచేతులఁ బట్టుకొని చప్పరముపై నాసీనుఁ జేసినది. దానితో నంతటి వీరునికి మొగ మంతయు స్వేదమయమైనది. ఏమిచేయవలయునో వానికింకను బోధపడలేదు.

"స్వామీ! మీదర్శనము నాకుఁ గ్రొత్తదిగాదు. మీ వీర గాథలు నాకపరిచయములు గావు. మీ స్వామిభక్తి, మీ దేశ సేవాధురీణత నా కనుదిన ప్రశంసములై, కాలక్షేపమార్గములగు చున్నవి. నేటికి మీకు నాహృదయమును నివేదించుకొను నవకాశము లభించినది. సదుత్తరమునకు నేను గాంక్షింపవచ్చునా?"

ఆమె వాక్ప్రవాహ మాగినది. రఘు విభ్రాంతితో నామె వచనము లర్థము లయ్యును గానివానిఁ బోలెఁ జూచుచుండెను.

"ప్రియా! నా జీవితవృత్తాంతమును వినియేయున్నారుగదా. మీబోటు లాధారమైన నా జీవితలత వసివాడకుండునని నాయాశ. త్రికరణశుద్ధిగా మీరే నాకుఁ గైవసమైన నా పితృదేవుఁడును సంత సించియే తీరును. నిష్కళంకమైన నా హృత్పటమున మీ చిత్తరువే లిఖింపబడియుండుట విన్నవించుకొనుచున్నాను." అనుచు స్వతంత్రముగ నొక పొగడదండ నాతని కంఠమున నామె వైచెను. అతని శరీర మప్రయత్నముగఁ బులకించినటులైనది. ఆమె సమా ధానమున కెదురు చూచుచున్నట్లు చూచినది.

రఘుకు మాట్లాడక తప్పినది కాదు.

"బాలా! సాహసించితివి. నీ మనస్సు మోహపడి మోసపడె నేమో యని నా యనుమానము. నా కులశీలాదులఁ దెలియకుండఁగనే నాకీ బహూకరణము పాడికాదేమో" రఘు చిఱునవ్వు నవ్వెను.

"స్వామీ! మీ కులశీలాదులఁ బితృదేవుల ముఖతః వినియే యీకృత్యమునకు నిశ్చయించితి. అన్నిఁట సామ్యమందిన మన దాంపత్యము తారతమ్య భేదము నందునా?" సరయూబాల నిర్మల ముగాఁ బలికినది.

ఈ యుభయులకు జీవితసామ్య మేమని చదువరులకు సందియము కలుగక మానదు.

మార్వాడు రాజ్యమును బరిపాలించు సుప్రసిద్ధవీరుఁడు రాజా యశ్వంతసింహుని ముఖ్యదళాధిపతి గజపతిదేవుని కుమారుఁడీ రఘు. గజపతిదేవుఁడు క్రీ. శ. 1648 సంవత్సరమున రాజ్యమునఁ దురుష్కుల యల్లరు లధికమైనపుడు వాని వారింప నేఁగి మొగలాయీల కుట్రచే గుడారముననే హత్య గావింపఁబడెను. వాని యిల్లాలు కులీన. సహగమన మొనర్చినది. నాఁడు దిక్కులేని యైదు సంవత్సరముల బాలుఁ డీ రఘు, మూఁడు వసంతముల బాలిక లక్ష్మి కాందిశీకులై దేశములఁ బట్టిరి. రాజా యశ్వంత సింహుఁడు పిరికిపందయై ఢిల్లీపాదుషాతో సంధిఁ జేసికొని వాని దర్బారున గుత్తకొనఁబడియుండుటయే యిట్టి కాందిశీకుల కష్ట పరంపరకుఁ గారణమైనది. ఒక బ్రాహ్మణుని యింటఁ బెంచఁబడు పైయిరువురిలో లక్ష్మి యొకహంతకదళముచే నపహరింపఁబడినది. ఆ సమయమున కామె నవయౌవన సుందరాంగి. రఘు వీరయువకుఁడు .ఆ కష్టదశయందే, రఘు కృతప్రతిజ్ఞుఁడై రాజకోటలోఁ గల

శ్రీ శివాజీకొలువునఁ జేరెను. విజాతీయుల రూపుమాపి హిందూ రమకుఁ దృప్తిఁ గల్గింప బద్ధప్రతిజ్ఞుఁడైన నాఁటి రఘు సాహసమువర్ణింపఁ దగినది. ఇతఁడు శత్రువులచేఁ బంపఁబడినవాఁడై యుండునని శంకించిన శివాజీ వీనిపైఁ దీసికొనిన పరీక్ష యద్భుత మైనది. రఘు చేతిని భవానిముందు వేదికపైనుంచి, కత్తికొనతోఁ బొడుచుచున్నను రఘు చలింపనే లేదు. కరమునఁ జిందిన రక్తపుబొట్టునే శ్రీ శివాజీ రఘు ఫాలభాగమున బొట్టుగ నుంచి యప్పుడే ప్రమాణమును జేయించెను. ఆ దృశ్యము దేశీయవీరులకుఁ బులకాంకురము గల్గించినది. రణదేవి భవాని విజృంభించి యుత్సాహముఁ జూపినట్లు వారి హృదయ ముప్పొంగినది. "జయ్ భవానీ" యను రఘు కంఠ ధ్వని మాతాపితృల దుఃఖాత్మల కూఱటఁ గల్గించుటయే కాదు భీకువై చెదరి పాఱుచున్న జాతీయదళవీరులకుఁ బ్రాణధైర్యములఁ బూరించినది.... నాటినుండియు శివాజీ మహారాజు రఘు నత్యంత ప్రాణహితునిగ భావించెను. శత్రువులచే హరింపఁబడిన తనచెల్లెలి నన్వేషించుటయు, తల్లిదండ్రుల ఋణమును దీర్చికొన విజాతీయులను దేశమునుండి తొలగించుటయు నాదర్శములుగాఁ గొన్న రఘుకు సరయూబాలతో సామ్య మేర్పడినది. ఇద్దఱును గాందిశీకులే... అయ్యది గమనార్హము...

"మన యిద్దఱిలోఁ దరతమ భేదముండదని, జీవితాదర్శములను, కృత ప్రతిజ్ఞలను విస్మరించి చరించుట భవానికి నాగ్రహ కారణమౌనేమో? ప్రియా! యోజించుము." రఘుకుఁ గొలది ధైర్యముకల్గి యనెను.

"స్వామీ! స్థితప్రతిజ్ఞులము గాకుండగనే నన్ను బరిణయ మాడుఁడని చెప్పుటకు నా మనస్సు నిర్బంధము చేయుటలేదు.

ఈ యేకాంత ప్రకృతిసుందరదృశ్యములో సృష్టిసాక్షిగా నాకు మీ రవలంబనమౌదుమనినఁ జాలును. నాకును, మీకును, దేశమున కును మహోపకార మొనర్చిన విజాతీయులను సంహరించి నా తల్లి దంష్ట్రలకుఁ గూడఁ దృప్తిఁ గల్గించఁ బ్రతిననూనుట నా జీవితా నందము గాకపోదు. ఏమందురు?"

కరుణవీర శృంగారముల మేళవించి పల్కిన సరయూబాల కంఠమాధుర్యమునకు రఘువిచిత్ర మొందెను. ఆ మధురకంఠములోఁ గూడ నెట్టి ప్రతీకార పౌరుషశక్తులు గుబగుబలాడుచుండెనో వెన్నెలరాత్రియు విశదపరచినది. ఉభయుల ప్రతిజ్ఞ యొక్కటియై, ఉభయుల యాదర్శ మొక్కటియై, కృతకృత్యత యమరుచో నా దాంపత్య మనురాగవారిధి స్థిరముగఁ దేలియాడకపోదు. ఇట్టి సమానజీవన స్రోతస్సు లేకమగుట తప్పక సృష్టికర్త యుద్దేశమై యుండును. రఘు యంతరాత్మ మంగళకర భావతంత్రుల మీటు చున్నది. అప్రయత్నముగ నతఁడు సరయూబాల చిబుకమును కరాంగుళుల స్పృశింపుచు "కోమలి! జీవితస్థైర్యము చిక్కని నా హృదయాంతరమున గూడుగట్టుకొనఁ గాంక్షించు నీవంటి కీర మొందుండు నని తెలియనైతిని. ఏ సౌఖ్య మాశించి యీపనికిఁ బూనుకొంటివో నీ మనంబునకే తెలియును. భవానిసాక్షిగా దేశ రక్షణోద్యమమున నుద్యమించిన నాకు జయప్రాప్తి సిద్ధించిననాఁడు శ్రీ శివాజీ మహారాజుల పాదపద్మసన్నిధిని, శిరమును వంచి "భవానీకి జయ్" యని పలుకునప్పుడు నీకరమును గ్రహింప నభ్య ర్థింతును. అంతదనుక నీ మనోకామనము నాకుఁ గవచమగుఁ గాక!... నీవు వీరపత్నివని ప్రజాహృదయ పత్రముల స్వర్ణాక్షరము లలో విలిఖింపఁబడు సుయోగ్య చరిత్రను నిర్మించుకొందువుగాక...

ఇయ్యెడ నాకు మాతృదేశ దుఃఖసముద్రఘోష వినా యన్యము విన్పింపకుండుటను సహింతువుగాక !...

రఘు మాట్లాడుచునే యుండెను. సరయూబాల తన వెంబడి రహస్యముగఁ దెచ్చిన బరణిఁ దీసి యందుంచు కుంకుమను రఘు మోమున వీరతిలక ముంచెను. అట్లుంచు నామె పెదవులనుండి, "దేశమాతకు విజాతీయుల బాధను దొలగింతువుగాక! హిందూరమ శౌర్యసంపత్పరిపూత యని యశమును దెత్తువుగాక!" యను పదములు వెలువడినవి. ఇపు డాతని మోము ప్రభాతారుణ సందీప్త మైనది. ప్రకృతి పరిమళములఁ గ్రమ్మరించినది. దిశలు నిర్మలమైనవి. చంద్రకాంతులు హారతులెత్తినవి. విశాలవిశ్వఘోషలో నే యమంగళ శబ్ద మేని ధ్వనించెనేమో... భావికాల ఫలితము నిర్ణయింపవలె.

అనువైన శుభసమయమున నుభయులు గలిసికొంటకు వాగ్దత్తము లైనవెనుక, అన్యోన్య సుమబహూకృతి యనంతరము భవానీ ప్రార్థనావసానముగ నా సమావేశము ముగిసినది. ఇద్దఱి యంతరంగములును దీయని భావిఫలముల నాశించెను. ఇద్దఱి తలంపులు మధురములే... నిశ్శబ్ద మందగమనమున సరయూబాల నిష్క్రమించినది.

ఆ రాతిచప్పరముపై, పైభాగమందలి శశి నీక్షించుచుఁ బరుండిన రఘుహృదయ మొక పాలసముద్రమైపోయెను. "ఏమి యీ సంఘటనము? శకుంతలను జ్ఞప్తికిఁ దెచ్చు నీయమకు నేనంగుళీయక మేని బహూకరింపనైతినే! ఏమి నాయవివేకము? గౌరవభావశూన్యమైన నా హృదయము నేమనవలె? కణ్వునిఁబోలిన గురుదేవుఁ డీ సంయోగమును మెచ్చునా? బహుళ రాజ్యకార్యభారవహుఁడగు

శ్రీ శివాజీ మహారాజ్ కృత్యము నెఱింగిన నా చేష్టకు శిక్ష లభింపకుండునా? స్వేచ్ఛాప్రేమము చిరకాల వియోగమునకును, చిరంతన దుఃఖసంతతికిని ద్రోవఁదీయునందురే! ఏమో! మా భావిజీవిత మేమార్గమును బట్టనున్నదో... నా స్వామిభక్తి జయించిననాఁడు గదా నా యదృష్టము! నా చెల్లెలు లక్ష్మి నాకు లభించునాఁడు గదా నాకుఁ బరమానందము!"

రఘు అటులనే విచారించుచుఁ గన్నుల మూసెను. ప్రభాత మైనది. కాల్యకృత్యముల నిర్వర్తించు సమయమునకే జనార్దన దేవులు పత్రములకుఁ బ్రత్యుత్తరముల వ్రాసి రఘూబాకిచ్చిరి. పరిసరముల స్వేచ్ఛగా మేయుచున్న పంచకళ్యాణికిఁ బని గల్గినది. గురుదేవు లనుజ్ఞ నిచ్చుచున్నారు.

నాయనా! రఘూ! శైస్తఖాను ప్రభృతుల నోడించు నుపాయములు, తదితరములు తాళపత్రముల వ్రాసియే యిచ్చితిని. జాగ్రత్తగాఁ గొనిపొమ్ము. శత్రులచేతఁబడిన దేశమాత కపచార మగును సుమీ! శ్రీ శివదేవుని యోగక్షేమములను దోడ్తోడ నంపుచుండుమనుము. భవానీపూజలలో మాతృశ్రీ జాగరూకత కల్గియుండవలెనని తెల్పితి ననుము.

ఆ మాటల వినుచు రఘు "రాత్రి జరిగిన యసమయ సంఘటనమును గురుదేవు లెఱుఁగియుండరుగదా? లేక — నేనే చెప్పుదునా? చెప్పకున్న ద్రోహి నగుదునేమో?" యని సందిగ్ధ స్థితిలో నిలువఁబడియుండెను, జనార్దనదేవు లోకపటి కన్నుల మూసి యర్ధనిమీలితముగ నొనర్చుచు, "రఘూ! వ్యర్థమును యోజింపకుము. జరుగవలసిన సన్నివేశ సంఘటనములు జరుగక మానవు-

అంతయును భగవల్లీల. అతని యనుశాసనము లేక యణువేనియుఁ గదలదు. సంయోగవియోగములు సర్వేశ్వరుని దృష్టిభేదములు. దానికేమి? తఱచు వార్తలఁ దెచ్చుచుందుము. ఔనా!" యనుచు నాశ్రమములోనికిఁ జూపుల మఱల్చి "అమ్మా! బాలా! రఘు నేఁగుచున్నాఁడు. అనతికాలమున భగవతీప్రసాదార్హుఁడై రాఁగలఁడు. దివ్యజ్యోతిని వెల్గించి మంగళకర ప్రయాణ సూచనములఁ జేయుము." అని చిఱునగవులఁ జిందించెను. మఱల రఘువైపునకు సాభిప్రాయముగఁ జూచెను.

అంతతో... మన నవయువకుని కున్న మనఃస్థిరత్వమును దొలఁగెను. అది యధైర్యముగాదు. ఆనంద రసాతిరేకమునఁ గల్గిన రాగవైకల్యమది. ఇఁకేమి! రఘు మనోవాంఛిత మచిరకాలమున నెఱవేరునన్న మాటయే. సరయూబాలయో స్వాప్నిక జగత్తునుండి యథార్థ దృశ్యమున కవతరించఁగలదు. గురుదేవుల యనుగ్రహము లభ్యమైనది. ఇఁక మిగిలినది... మాతృదేవి భవాని మన్నించవలయును. ఊహలలోఁ దేలియాడు భవితవ్యమున కొక రూపముగల్గు శుభసమయము రావలయును. అయ్యును... గురుదేవులు తమ సంఘటనమును దలంచియే మాట్లాడుచున్నారా... అనుమానము పోలేదు.

ప్రయాణ సన్నద్ధుఁడైన రఘు తన శరీరమునఁ నంగరఖాను సవరించుకొనుచు నొక్కసారిగ నిర్విణ్ణుఁడయ్యెను. అతనిని భయ సంశయములు చుట్టుముట్టినవి. కారణము?... రేయి సరయూబాల సానురాగమున వైచిన వకుళమాలిక కంఠాగ్రముననే యున్నది. దాని నేమరుపాటునఁ గాబోలును తీయ మఱచెను. దానిని జూచియే కాఁబోలును గురుదేవుని వ్యంగ్యోపన్యాసము సాగినది.

ఇప్పుడు రఘు పడుచున్న కలవరమును వృద్ధ బ్రాహ్మణుఁడు పోల్చక పోలేదు.

"రఘూ ! కడచిన దానికిఁ గలవరమేల ? సర్వమును భగవానుఁ డనుకూలమునే చేయును. నా మనోవాంఛితమునకు విరుద్ధముగా శ్రీశుఁ డాచరించుట నాకనుభవముకానిది. నా యంతరంగమెప్పుడో యాశించి యాశీర్వదించినది. ఇఁక ప్రాజ్ఞుల దీవనల నందు పరమోత్తమ శుభసమయము రాకపోదు. సిగ్గిలకుము. వేచియుండుట మానవుని విధి."

గురుదేవుల పల్కులకు రఘు శిరమును వంచుచు నమస్కరింప మోకరిల్లెను. వృద్ధ బ్రాహ్మణుఁడు వానిని గౌఁగిటలేవనెత్తుచు "సరయూ ! జ్యోతిని వెలిగించితివా ? వచ్చి రఘును సాగనంపుము. అతిథుల నగౌరవపరచుట శాంతినికేతన వాసుల కనర్హముసుమా!" యని హేలగా నవ్వెను.

ఇట్టి మర్యాద తానందుట నూత్నమగుటచే రఘు సిగ్గుచేఁ గ్రుంగి పోయెను. విధి లేనట్లు... సరయూబాల పైట చీరను సవరించుకొనుచు, క్రీగంటిని గాంతులఁ బ్రసరించుచుఁ బ్రాంగణములోనికి నడుగుంచెను. గురుదేవుని యాశిషము, ప్రియురాలి వినీత దృష్టి నందిన రఘు తురగమును, సులువుగ నధిరోహింపలేక పోయెను. ప్రయత్నమున వేగమున కుపక్రమించుచు నుత్సాహమున వెనుదిఱిగి చేయూడించెను. ఆ కరచాలనము రాఁబోవు హిందూరమా సౌఖ్య పరంపరల జయధ్వజ సంచలన మని గురుదేవు లుత్ప్రేక్షించుకొనిరి. తన పవిత్ర ప్రేమరాజ్య చిహ్నమైన కేతనమని సరయూబాల రూపించుకొన్నది. ఏమైనను... భవితవ్యము వచింప వలనుగానిది...

రాజకోటలో నేవేని వింతలు పుట్టకమున్న ప్రవేశింప వలయు నను రఘుకోరికను మందమలయానిలము ద్విగుణము చేయుచుం డెను...దూరమునకు వానిగమనము దురూహ్యమైనది... కేవలము పాషాణములఁ బ్రతినినదించుచుండిన "టకటక"...ఎక్కడ?ఏమి?...

## 3

గణగణ ఘంటారావ మాకస మంటినది. భవానీ నామ సంస్తుతి దిశల వ్యాపించినది. సద్బ్రాహ్మణుల వైదిక నినాదములో మంత్రపుష్ప నీరాజనాది సత్క్రియలు జరిగిన యనంతరము భవానీ దేవాలయ మొక్కపరి నిశ్శబ్దమైనది. అగరుధూపపరిమళములు వాతావరణమున నవ్యచైతన్యమును వ్యాప్తముఁ జేయుచున్నవి. పూజారులందఱును నసంభ్రమచేష్టల శ్రద్ధాళురై యర్చనాదివిధుల నెఱవేర్చుచుండిరి. కొందఱు ముత్తైదువలు, పౌరులు, వేదికలపై మంటప పరిసరముల నుపవిష్టులై కుంకుమపూజను బాగడుచుండిరి. బాలురు గెంతుచు నటుయిటు దిరుగుచుండిరి.

లోన శ్రీ శివాజీమహారాజు సుస్నాతుఁడై స్వయముగ దేవికిఁ గుంకుమపూజఁ జేయుచుండెను. అతనిమూర్తి గంభీరమై హృదయాదర్శము యొక్క వైశాల్యమును జూపుచు ఫలసిద్ధికై యావేగమొందుచున్నదని తెలియఁ జేయఁగలదు.

క్రమముగా సూర్యదేవుఁడు పశ్చిమాబ్ధిని గ్రుంకుటను రాగ స్నిగ్ధమైన యాకాశ ముద్రేకము నుద్దీపింపఁ జేయుచున్నట్లుండెను. పూజలు ముగిసినవి. పౌరులందఱును వారివారి యిండ్లకభిముఖులైరి. ఒకరిద్దరర్చకులు తప్ప తదితరు లందఱును వెడలిపోయిరి. గర్భ

దేవాలయమున దేవిసన్నిధి నుండినవారు ముగ్గురు వ్యక్తులు మాత్రము... వారి సంభాషణము మెల్లగా సాగుచున్నది.

తానాజీ! మాతృదేవి కోరిక ప్రకారము తోరణదుర్గమును జయించిన నాఁడుగదా మన జాతీయత నిలువఁద్రొక్కుకొనునది? ఎన్నఁడిది సంభవమో యోజించి చెప్పఁగలవా?

మహారాజా! శ్రీ శివదేవు లుద్యమించిన నడ్డెన్నఁడేని గలుగునే? ప్రయత్నమా - యేలినవారిది. ప్రయోజనమా - పవిత్ర గోబ్రాహ్మణరక్షణతో భారతసీమ నుజ్జీవింపఁజేయుట. పరమా శిషమా - గురుదేవ, భవానీ, జిజియాబాయీలది. ఇఁక సందియ మేల కల్గునో విచారింపరానిది...

నాయనా! శివా! తానాజీవంటి యుత్తమ వీరులు భవానీ పాదపద్మముల సేవకై యనారత తత్పరమనస్కులై యుండ నీకేమి కొఱంతయు రాదు. మా యాశీస్సుల నటుంచుము. మొగలాయీల యనుపపాదముల క్రింద నలుగుచున్న పీడిత ప్రజాకోటి యాక్రందనము రిక్తఫలము నిచ్చునే?

అల్లరులను మూర్ఖు లొకరిద్దరొనరించు చిలిపి పనులుగా భావించుట యెట్లు? అసంభవము. తల్లీ భవానీ! భారతమాతృపరితాపమును బాపనోపని యీవ్యర్థుని క్షమింతువా?

శివాజీ యిటు లనుచునే చండిక ముంగిట సాగిలి వివశుఁడై కొండొకకాల ముండిపోయెను. దేవళముచుట్టును రక్షకభటు లతి జాగ్రత్తగఁ గావలిఁ గాయుచుండిరి. లోనిముగ్గురి సంభాషణమున కంతరాయము లేదు.

నాయనా! శివా! యశ్వంతసింహుని గలిసికొన నేఁగితివే, తత్కార్య సాఫల్యమును వివరింపవైతివి?

అమ్మా! ఆ మార్వాడురాజు ప్రచ్ఛన్నవేషమున వచ్చిన నన్ను గని యచ్చెరువందుటయే కాదు... అసందర్భ సమాధానములఁ గూడ నీయఁదొడఁగెను. మొగలాయీలు బలాతిబలులఁట. వారు నిష్కల్మషులఁట. వారికి లోఁగియుండినను దోసము కాదనియు, శాంత్యహింసల నాదర్శముగఁ గొన్న వ్యక్తి యుద్ధము నిచ్ఛగింపఁడనియు నుపన్యసించెను. వాని బుద్ధిబలము నేమందును?

ఆర్యరాజుల ప్రాభవము నశించుట వానికిష్టమని యర్థమగుచున్నదిగా యని తానాజీ తీవ్రముగఁ బ్రశ్నించుటతోడనే మాతృశ్రీ యిట్లనెను... దేశీయు లెట్లు సంస్కారరహితులై పీడల నొందుచుండిరో, తురుష్కు లెట్టి యిడుముల నిడుచుండిరో నీవు వచింపలేదా?

అమ్మా! అంటిని. అయ్యును బ్రయోజనము. చెవిటికి శంఖమూదుట. తన స్వీయరాష్ట్రమున నెన్ని గ్రామములు బూడిదకుప్పలైనవో, ఎన్ని కుటుంబములు గతిమాలి నశించినవో యశ్వంతసింహుఁ డెఱుఁగఁడా? భోగలాలసత, స్వార్థపరత, పౌరుషహీనత, పెచ్చుపెరిగిన మానవుఁ డీ దేశమాత కెటు లుపకరింపఁ గలఁడు. తోటిసోదరుల యవమానము, స్వీయసంస్కృతి వినాశనము, కండ్లారఁ గాంచియును విజాతీయుల పొత్తునాశించు ప్రభువు దాపురించిననాఁడు దేశీయుల కగుదుర్గతి నూహింపఁగలమా?

శివాజీకిఁ గల్గు నాగ్రహావేశమును శీతలపఱుపఁ దానాజీ సంభాషణమును మఱలింప నిశ్చయించెను.

మహారాజా! ప్రతిక్రియ లనంతములు. వానికై మీ రుద్వేగులు గానక్కరలేదు. ఏసుముహూర్తమున రక్తతిలకమూని, ఖడ్గధారణఁజేసి భవానీదేవి పాదపద్మములచెంతఁ బ్రతిజ్ఞలఁ బట్టితిమో, మాతృశ్రీ యిడిన దీవనల నందితిమో... ఇఁక.. తత్కార్యమునకై పరితపించుట యెందులకు ?

తానాజీ! పరితాపము గాకేమి? ఇయ్యది యసూయతో, పదవీవ్యామోహముతోఁ జేయుప్రతీకారమని యశ్వంతసింహుని వాదము. అంతియేకాని... ఆత్మరక్షణకుఁ జేయఁదగు సంగ్రామమని యొప్పుకొనఁడు. నాల్గుగోడల యంతరమున బంధింపఁబడిన బిడాలముపై దండమెత్తిన నయ్యది యాత్మరక్షణకై వెనుదిరిగి కన్నుల నూడఁబీకకుండునే? కుర్కురము కుందేలును గసిమసంగ యత్నింపవచ్చునుగాని, కుందేలు ప్రతిక్రియగా మోసముఁజేసిన దోసమను విజ్ఞులుందురే? నేటి భారతము స్థితి యంతకు మించి యున్నదే? మన మొనర్చునది మానవతత్వసంరక్షణము గాని-మారణహోమసన్నాహముగాదే? స్వజాతి నుజ్జీవ మొనర్చుకొను ప్రబోధమేగాని పరజాతుల భక్షించు మనియెడి ప్రచారముగాదే మనముచేయునది. అమ్మా! లోక మిట్టియంధకారమునఁ దూలుచున్నదేమి! అజ్ఞానమున మునుఁగుచున్నదేమి? పరరాజుల భయంకరాతిక్రమణముల నెదిరించు నాత్మశక్తి శూన్యమగుటనుగదా! ప్రజల సుఖజీవనము జాతియొక్క యౌన్నత్య చిహ్నమని తెలిసియుఁ దన్నాశమున కుపక్రమించు విజాతీయుల రూపుమాపనుద్యమించుట యపచార మగునే? ఆర్యరాజుల సదాచార సంస్కృతి, వైదికసంపత్తి, రాష్ట్ర పునర్నిర్మాణమున నుద్ధరింపఁబడకున్న, యుగముల నుండి యుండు మన యస్తిత్వము తొలఁగిన దను

మాటయే ... జయ్ భవానీ ... తేజోత్సాహముల నొసంగుము....

కుమారునిలోని వెల్గునుగని మాతృశ్రీ పరమానందమందినది. తనకుమారుఁడు పీడితలోకమునకు సంరక్షకుఁడు కావలె. తన తనూజుఁడు పేదరైతులకును, కాందిశీకులకును జీవగఱ్ఱ కావలె. భారతావని పూర్వపు ఔన్నత్యము నంది, విశాల విశ్వమందు మాయని యశఃకాంతులఁ బ్రాకించుకొనిన తన కుమారుని పుట్టువు సార్థకము కాఁగలదు. ఇదియే యామె కాంక్షించునది. తనభర్త శాహీ ద్వితీయ వివాహమునఁ గులుకనిండు... పాదుషాయిడిన జాగీరున సౌఖ్యమందనిండు. ఆమెకుఁ జింతలేదు. పతియందలి గౌరవభావముకన్న- తన హృదయమున కూఱటఁ గల్గించు ననుంగు బిడ్డ "శివాజీ" తన శిక్షణమున యశము నందవలయునన్న వాంఛ యందే యామె కాశ మెంచు. ఆమె వీరపత్ని యనిపించుకొనవలయునని ముఱిసినది... కాని...ఆమెను వీరమాతవు గమ్మని విధి యాశీర్వదించెను. పాతివ్రత్య మాహాత్మ్యమును మించి, భారత మాతృహృదయౌన్నతిని లోకమునకుఁ జాటుమని సృష్టికర్త యాదేశించెను. రక్తరంజిత తిలకముగల మోము, గంభీరమైన దృష్టులు, భావావేశమును జాటు ఫాలము, పౌరుష ధూమములఁ జిలికించు మీసములు గల శివాజీని శివదేవుఁడే పుత్రుఁడుగా ననుగ్రహించెనని, వీనియవతరణము స్వజాతికెంతయో యుపకరించఁ గలదని యామె యెంతయో యువ్విళులూరుచుండును. రత్నగర్భ యగు భారతమాత- స్వీయవిజ్ఞానము, స్వయంసంస్కృతి, స్వకీయ ప్రతిభ మొదలగువానిఁ బోనాడుకొని, పరరాష్ట్రములవైపు బిచ్చకత్తెవలె దైన్యదృష్టుల సారించుట జిజియాకు భరింపరాని

విరూపముగాఁ దోఁచుచుండును. అనుగమగునకు నాచారధర్మముల నుచితనిర్ణయ మొనర్పఁగల మహర్షులు నివసించు నార్యావర్తము బర్బరుల ప్రాబల్యమున నవమతి నొందెనని చరిత్రలో వ్రాయఁబడ రాదని యామె దృఢనిశ్చయము. తన యంతరంగమిడు నుపదేశ ముల సారాంశమే శివాజీచే రాజకోటను సృజింపఁజేసినది. సింహ గఢము మొదలగు దుర్గములఁ గొన్నిటి నౌరంగజే బిత్తునని వార్త నంపెను గాని యట్టిదింతవఱకుఁ గ్రియారూపము నందలేదు. తొలు దొల్తఁ దోరణదుర్గమును వశ మొనర్చుకొని, యనంతరము మిగిలిన దుర్గాక్రమణమున కుపక్రమింపవచ్చునని శివాజీ ప్రభృతుల యాలోచనము. అల్పసైన్యముతోఁ జేయు నీ దండయాత్రలు సఫలము గావేమో యను సందియ మీ వర్గమునకు లేనేలేదు. అంగారపుతునుక తలచిన నెన్నియడవులనేని దహింపఁ గలదను మాతృశ్రీ యుద్బోధమే వీరిధైర్యమున కవలంబనము. వీరువై చెడి మార్గము వీరికిఁ బరిపూర్ణ జయము నీయకున్నను జాతీయ వీరు లెందఱికో ప్రాతిపదిక కాఁగలదని యీ మహానాయకుల యాత్మ విశ్వాసము. దేశీయవాతావరణ మంతయు మబ్బుగ్రమ్మినటు లున్నను వారికధైర్యములేదు... వారి నిశ్చయనౌక సముద్రగర్భ మున విడువఁబడినది. పారమును ముట్టునా ? పాతాళమును జేరునా ? ఎవరు నిర్ణయింపఁగలరు ?

పల్లెటిగ్రామముల యాధారము చాలదొరికినది. ఏమైనను రైతులోకమే సహాయమును జేయవలయును. జానపదములే సత్య మును బ్రచార మొనరింపవలయును. తానాజీప్రభృతులందఱును సామాన్య రైతులేగదా... శివాజీకిఁ గుడిభుజములై, సైన్యా ధ్యక్షులై విరాజిల్లుచున్నారు. ఎన్ని రహస్య కేంద్రములలోనో

"ఆత్మరక్షణ దళములు" రణశిక్షణ నొందుచున్నవి. లెక్కకు మించినయువకులు వేనవేలుగా నాదళముల పాల్గొని జాతీయ నిజ తత్త్వముతోఁబాటు శారీరకబలసంపదను గూడ దృఢపఱచుకొను చున్నారు. "శాంతినికేతనము" వంటి యాశ్రమముల నిట్టి వర్గములు భూగర్భమున సిద్ధమొనర్పఁబడు చున్నవని లోకమున కింకను దెలి యదు... అస్తు... ప్రస్తుతము....శివాజీయుపన్యాసము సాగుచున్నది.

నేఁ డీ పాదుషాల యన్యాయచర్యలేమి? భారతీయులంద అను బానిసదాసులుగాఁ గొని రత్నరాసు లన్నిటిని దమస్వార్జిత ములుగ భావించవలయు ననుకొను వివేకులు కీర్తిఁ గొనఁగలరా? పిఱికిపందలైన హిందూప్రభువులెల్ల ఢిల్లీదర్బారున జాగిలములైరే! ఎంతవైపరీత్యము సంభవించెను? మొగలాయీలు భారతబంధువు లని వర్ణించు విమర్శకచారిత్రికుల నేమనవలె?... సిగ్గువిడిచి వారిచ్చు మనువర్తుల ననుభవించుచుఁ దురుష్కులు పక్షపాతరహి తులని మెచ్చులఁ బల్కు మ్రుచ్చు లధికమైరే! తానాజీ! కానిమ్ము...మనమే యీచీకటులఁ బోకార్చవలె... మనమే యీ విషయ నిర్ణయ మొనర్చవలె?

మంగిలివాకిలిలోని గంట మ్రోఁగినది. ముఖ్యులెవరో వచ్చు చున్న సూచన యది. శివాజీ పల్కుచున్న మాటల కా నాదము "స్థిరము" "సత్యము" అని సూచనఁ గూడఁ జేసిన దన్నమాట. వచ్చినవా రెవరైయుందురో యని తానాజీ ప్రాంగణమునకుఁ బదము సాగించినాఁడు. వచ్చినవ్యక్తి రఘు...

లోనికేఁగి మహారాజునకు జయమని పల్కుచు జనార్దన పేరుల ప్రతివచనము లనుచుఁ బత్రము లర్పించి రఘు వినమ్రుఁడై

తలవాంచి నిలువఁబడెను. రెండునిముసములలోఁ దానాజీ యన్నిటిం జదివి వినిపించెను. జిజియాబాయి యాలోచన మేమియోకాని శివాజీ యాగ్రహమునకు మితిలేదు. శైస్తఖాను పూనానగరమున బసఁజేసెనా ? ఏ పుణ్యక్షేత్రమున శివాజీమహారాజు తనబాల్యలీలల నెఱపుకొనెనో, ఏ దివ్యభవనములఁ గొండదేవుఁడు విద్యాబోధనలఁ బ్రతినినదింపఁజేసెనో... అట్టి స్థలమునకు నేఁడు శైస్తఖాను శివాజీనే చంపవలయునని విడిది దిగెనా ? ఆకస్మికముగ మనలను ముట్టడించుటకై మార్వాడు రాజాసైన్యముగూడఁ బూనాల్లో డేరాలవైచెనా? ...శివాజీని బంధించుటయో మ్రందించుటయో త్వరలో నిర్ణయము కాఁగలదని వారి యాలోచనమన్నమాట. మొగలాయీలకు మహారాష్ట్రుల ధాక పూర్తిగాఁ దెలియును. బాకర్‌దుర్గమును ముట్టడించునపుడు వారందిన యవమానము మఱువరానిది. అయ్యో యింతలోనే విస్మృతినందినారనిన వారి మనస్తత్వము బోధపడుచునే యున్నది. మన భూముల నాక్రమించి మననే భక్షింపఁ జూచు నొక్కొక్క విజాతీయసైనికుని మహారాష్ట్రవీరులు ఖండఖండములుగాఁ జెక్కినపు డీతంత్రము లన్నియు నేమగునో చూడవలయును.

ప్రాంగణమునందలి ఘంటారావము మఱల వినవచ్చినది. జయ్ భవానీ... ఈ పర్యాయము శివాజీకి నమస్కరించునది యొక వృద్ధబ్రాహ్మణుఁడు...

"స్వామీ! ఆశీర్వదింపఁదగిన విప్రోత్తములు... ఇదేమి యన్యాయము... నమస్కరింపక... విషయమేదియో విన్నవింపుఁడు." శివాజీ యాతృతగఁ బల్కెను. వృద్ధబ్రాహ్మణుఁడు సేవకులచే నడ్డగింపఁబడకుండ లోనికేతెంచెగుదెంచెనా యని తానాజీ

ప్రభృతు లాలోచించుచుండిరి. ఈతఁడు వంచకుఁడు కాఁడుకదా యని వారి యనుమానము.

మహారాజా! పూనావద్దగల పథర్‌పూరను పల్లెటూరు మాది. మొగల్ సైన్యములచేఁ గొల్లగొట్టఁబడి మా పురజను లందఱును బుట్టకొకరైనారు. ఎంతమందియో చిత్రవధ చేయఁ బడినారు. నేను మాత్రము చచ్చిపోయినట్లు నటించి వారు మొగము త్రిప్పుటతోఁ బాఱి వచ్చితిని. మా స్థితిని శ్రీవారికి విన్నవించుకొన...

ప్రజల సంరక్షణయే ముఖ్యముగా నెంచిన నేను మీ కాశ్రయము తప్పక యీయఁగలను. మొగలాయీలకుఁ జెఱుపు కాలమాసన్నమైనది. పండిత్ జీ! విశ్రమింపుఁడు. అనతికాలమున...

మహారాజా! ఏమి చెఱుపుకాలము? శ్రీవారి కగ్ని పరీక్షా దినము లాసన్న మైనవని యనుకొనుటలేదా? పూనానగరమున శైస్తఖాను మకాముఁ జేయుట, మహారాష్ట్రులకు నీరుతోడెదనని ప్రగ్గె లాడుచున్నాఁడే? యశ్వంతాది యార్యరాజులే మీకుఁ బక్కలో బల్లెము లగుచుండ మీకు మనుమార్గమేది? మాకు రక్షణోపాయ మేది? వేలాది హిందూస్త్రీలు మానభంగమునంది మరణించుచుండ వ్యర్థులై చూచుచు దినములఁ బుచ్చఁగల హైందవ మీనాటికిఁగదా యవతరించినది. ఇతర వ్యక్తులమాట యటుంచి బంగారముఁ బండించు రైతులు పాదుపాల పాదరక్షలను మోయవలయును గాఁబోలు... వృద్ధుఁడు గద్గదికమును గ్రమమున నటించెను...

జిజియాబాయి పొంగివచ్చు నశ్రువులఁ దుడిచికొనుచు భవానీ పాదముల నేకాగ్రమునఁ జూచుచుండెను. తానాజీ యుగ్రమూర్తియై

లోనియగ్నిని జల్లబఱుప యత్నించుచుండెను. రఘు విషయమంతయు నీవఱకె యెఱింగియుండెనో యనునట్లు కదలక నిలుచుండెను. శివాజీ యేమి సమాధాన మీయవలయునో తెలియక "ప్రతిక్రియ, ప్రతిక్రియ" యని దంతముల నణచి నూఱుచుండెను.

ఇంతలో నొక విచిత్ర సంఘటనము... వృద్ధబ్రాహ్మణుఁడుగా వచ్చినవ్యక్తి రూపాంతర మొందెను. అతని నెఱసిన గడ్డముఁ దలయు మాయమైనవి. శరీరము వికసించినట్లై యౌవనమును ధరించినది... ఏమది ? ఎవరా పురుషుఁడు ? శివాజీ మహారాజునకు నచ్చినబంటు... భవానీదేవికి నిజభక్తుఁడు... జిజియాబాయికిఁ బుత్రప్రాయుఁడు... సూర్యాజీ...

నాటక మిట్టి హాస్యరూపమును ధరించుట కొద్ది కటువే యైనను వీరరసమునకు నవలంబనము లభించి రూపాంతరము సంభవించెను. అపరూప వార్తలఁ దెచ్చిన సూర్యాజీ మఱియు నేమి వచించునో విందమని చెవులన్నియు నటుమొగమైనవి... ఆసక్తిని వెల్లడించినవి...

శైస్తఖాను, చాంద్‌ఖాను ప్రభృతులతోఁ బూనా సంక్షుభితమగు చున్నదనియు, వాని నిర్మూలించు నుపాయములను గూడఁ దా నన్వేషించి కృతకృత్యత నందియే వచ్చితిననియు సూర్యాజీ చెప్పువెనుక నందఱిహృదయములను సంతోషజ్యోతులే వెల్గినవి... ఎట్లు ? ఏమి యొనర్చితివో విపులముగా వచింపుము... శివాజీ యుద్వేగముగఁ బ్రశ్నించెను...

మీ యాజ్ఞ ప్రకారము నేను మాయావేషధరుండనై కొందఱి మొగలాయీ యుద్యోగుల స్నేహము నందితిని. విషయ

మంతయు గ్రహించి శైస్తఖానుండిన భవనమంతయుఁ జూచియే వచ్చితిని. ఇఁక స్వల్పకాలమున మన మాకస్మిక దండయాత్రతో వారల మట్టుఁ బెట్టుటయే తడవు.

దాని కేమి యుపాయము? ప్రత్యక్ష వేషముల నేఁగుటయా?... ...

ప్రభూ! అయ్యది కాదు. పట్టపవలు నల్గు రైదుగు రొకచోఁ గుమిగూడరాదని శైస్తఖా నాజ్ఞనిడుటచే నేనొకపని చేసితిని. నేనొక ద్వారరక్షకుని వేషమున నేఁగి శైస్తఖానును దర్శించితిని. నా కుమార్తెకు వివాహము రాఁబోవు సప్తమిని జఱుగుననియుఁ బ్రక్కపల్లెనుండి మొగపెండ్లివారు తఱలివత్తురనియు, ఒకరోజు "ఊరేగింపు టుత్సవము" కూడ నుండుననియు నీపై విషయముల కన్నిఁటికిని బాదుషావా రంగీకరించి పత్రము దయచేయ వలయుననియు విన్నవించితిని. అతఁడే కైపులోనుండెనో, యట్లే పత్రము నిచ్చెను. ఆ పత్రమును మనము, ముఖ్యోద్యోగు లందఱికడను చెలామణీ చేయవచ్చును. కాన మనమిఁక... పెండ్లి వారమై బయలుదేరవలయును.

అచ్చటివారు సూర్యాజీ యుపాయమునకుఁ బరమానంద భరితులైరి. పెండ్లి... పెండ్లి... వధూవరులు లేకుండఁగనే జఱుగును గాఁబోలు...

జయ్ భవానీ! అందఱును దేవీ ప్రాంగణమున మోకరిల్లిరి. దేవాలయమునందలి గంటలన్నియు మ్రోఁగినవి. చుట్టుప్రక్కల వారలెందఱో గుమిఁగూడిరి. ప్రసాదమును బంచుటకు సూచనముగా నీ ఘంటికారవ మిాయఁబడును. చిన్నపిల్లల త్రోపులాట

లతో, పెద్దల యలజడితోఁ బ్రాంగణమంతయుఁ బ్రతిధ్వనిదించినది. ప్రసాదము పంచిపెట్టఁబడినది... అంతయు సందడిలోనే...

# ౮

ధర్మము జయించు ననునది సామాన్య వాక్యము. ఎన్ని యగ్నిపరీక్షల వెనుక నియ్యది సంభవించునో పామరహృదయ మెఱుఁగదు. మన మధర్మమార్గముల నడుగిడకుండినఁ జాలునని వచ్చెడి కష్టములను లెక్కించకుండుటకు ధర్మబుద్ధికిఁ దోడు ధైర్యగుణ ముండుట మానవులలో నఱుదు. శ్రీరామభద్ర ధర్మరాజాదు లే కొలదిమందియో పూజ్యులగుటకుఁ గారణ మియ్యదియే. ధర్మమునే యొనరించు చుంటిమని పాములకుఁ బాలుపోసెడి యజ్ఞులును సంఘమునఁ బలువురు గలరు. నిజమైన ధర్మమునకు నిర్వచన మీయఁగలవారిని గూడ వ్రేళులపై లెక్కింపవచ్చును. విచిత్ర సంఘటనములలో నెటుచెప్పుటకును బాలుపోక "ఏమో ధర్మమన మనకేమి తెలియును ? అంతయు భగవంతుని యిచ్ఛ" యను మెట్ట వేదాంతుల సంఖ్యకుఁ బరిమితియేలేదు. ఇట్టి మిశ్రమ మానవతత్వ సంపూరితదైన్యసంఘములయందు నన్యాయములును నసత్యములును, రణగొణ ధ్వనులును, రాక్షసచర్యలును బుట్టుట కేమియాశ్చర్యము.

జౌలీరాజా చంద్రరావు జీవితము పై వింతభావములఁ గల్గింపఁ గల విచిత్రగాథ. జౌలీ యనునది మార్వాడునకుఁ బ్రాంతప్రదేశము. ఈతఁ డేకులమునకుఁ జెందినవాఁడో నిర్ణయించుట కష్టము. తల్లి దండ్రు లెవరో తెలియకుండుటయే దీనికిఁ గారణము. మార్వాడు సర్వసైన్యాధ్యక్షుఁడు గజపతిదేవుఁ డొకనాఁడు... ఏటియొడ్డున నేడ్చుచు నొంటరిగ వచ్చుచున్న బాలు నైదేండ్లవాని నొకనిఁ

గాంచి, చుట్టుఁబ్రక్కల నెవరిని గానక తనయింటికిఁ దోడ్తెచ్చెను. తరువాతి కాలమునఁ గూడ నా బాలుని తల్లిదండ్రులెవరో యన్వేషణకు రారైరి. నాటికి గజపతిదేవునికి సంతానము లేదు. అటుపై జన్మించినవారే యిరువురు... రఘు... లక్ష్మి...

చంద్రరా విప్పుడు రఘుకంటె నేడెనిమిదియేండ్ల పెద్దవాఁడు... అయ్యును జూపులకు నలుబదియేండ్ల ప్రౌఢవయస్సు వానివలెఁ గానవచ్చును. తలలో నెఱసిన రెండు రెండు వెండ్రుకలు వాని సునిశిత భావాతిశయమును సాక్ష్యమిచ్చుచుండును. మెలి తిరిగిన మీసములు, వాడిచూపులు, విశాలముకాని నెన్నుదురు, చంద్రరావునకుఁగల స్వభావవైచిత్ర్యమును బ్రకటించక మానవు...

గజపతిదేవుఁడును వాని సతీమణియును జంద్రరావును స్వేచ్ఛనించి పెంచిరి. సకల సౌఖ్యములను దమబిడ్డలకన్న నెక్కువగఁ జూచిరి. లోకమునఁ గాలు నిలువఁద్రొక్కుకొనుబాటి భావసంతతి లభించిన వెనుక యే రాజకీయోద్యోగమందో ప్రవేశఁబెట్టిన వాని జీవితము రాణించను గలదు, మనకుఁ గీర్తియును గలుగఁగలదని యా దంపతుల యాశ. చంద్రరావు క్రమముగా సైనికశిక్షణయందుత్తీర్ణుఁడై, గుఱ్ఱపుస్వారియందుఁ బ్రజ్ఞను సంపాదించి యుత్తమ బహుమానములను యువకలోకమున గడించెను.

ఒకనాఁడు సైనికశిబిరములనుండి మఱలివచ్చుచుండ గజపతిదేవుని యశ్వము వ్యర్థముగఁ బెంకెతనమును జేసెను. ఒక తెప్పపాటులో దానికి పిచ్చియెత్తినటులై వెఱ్ఱిగా గెంతుచు దుముకసాగసడ. పైనఁగల గజపతిదేవుఁడు క్రిందపడెనా ప్రాణవాయువులు వీడవలసినదే. అంతటివేగమున దుముకుచున్న గుఱ్ఱమునుండి గజపతి

దేవునిఁ దనయశ్వముపైకి లాగుకొని కాపాడినవాఁడు చంద్రరావు. మిగిలిన యాశ్వికులందఱును దెల్లఁబోయి చూచుచుండిరి. ఆనాఁడే చంద్రరావు భాగ్యము పండవలసిన దినము... కాని యానాఁడే వానిపై దురదృష్టదేవత చేయిఁజాచినది.

"నా ప్రాణములఁ గాపాడిన నీ కేదైన బహుమాన మీయ వలయునని యున్నది కోరుకొనుము." గజపతిదేవుఁ డుత్సాహమునఁ బల్కెను. ఒక్క పర్యాయము చంద్రరావులోని యాశ లుబికినవి. వాని భావము లానాటికి మిఱ్ఱుఁబల్లముల నెఱుఁగవు. తారతమ్యములను దెలియవు. కష్టనష్టములఁ బోల్చవు...

కాలౌచితిని దెలియని వాని మనస్సు వెంటనే ప్రబోధించుటచే "మీ కుమార్తె లక్ష్మి నాకుఁ గావలయు" ననిపించినది.

గజపతిదేవుని యాగ్రహమునకుఁ బారములేదు. జనకుని బోలిన నన్నితఁ డిట్లడిగె నేమియని పెదవికొఱుకుకొని, "ఔను... సంస్కారశూన్య హృదయము సద్విద్యల గ్రహించినను వ్యర్థమే కదా! గౌరవమెఱుఁగనీవాని కిట్టి కాంక్షలే జనించునుగదా?" యని యాలోచించి "నా లక్ష్మి నీకీనాఁడు లభింపదు. నీ స్వీయకథ నెఱుంగని నీ విటులాడుట యుచితముగనే యున్నది. ఉత్తమక్షత్రియ కన్యను గ్రహించుటకు నెట్టి యుచితజ్ఞతయు నితరసంపద లవసరమో వానిని గ్రహించుకొనిరమ్ము. నీ కిఁక నాయింటఁ దావు లేదు. నీ వెటకేని వెడలిపోవచ్చును" అని కఠోరముగఁ బల్కెను...

చంద్రరావు పౌరుషమున నిలు వెడలిపోయెను. కొలది కాలముననే సాహసమున జౌలీప్రాంత ప్రజలకు నాయకుఁడయ్యెను. గజపతిదేవు నెటులైన నవమానమొనర్చి, వాని కుటుంబమును

హింసలపాలుఁ జేయుటకుఁ బ్రతిజ్ఞనూనెను. అంతియేకాదు. తన కవమానము జరిగిన నాటిరాత్రియే యొకచిఠాపుస్తకమును సంపాదించి యందు నాయవ్యయములు వ్రాయనారంభించెను. గజపతిదేవుఁడొనర్చిన తిరస్కృతి వ్యయము. ఇఁక ఆయమెప్పుడు వచ్చునో చూతమని నిశ్చయించుకొనెను. జమకాలమును బూరించు సమయమేనాటికేని రాకయుండునా ?

ఏడులు గడచినవి. మొగలాయీలతో యశ్వంతసింహుఁడు తలపడుట సంభవించినది. అంతయుఁ దారుమారైనది. గజపతిదేవుఁడు తురుష్కులచేఁ జంపఁబడుట... వాని సతీమణి సహగమనము... బిడ్డలు దిక్కులేక కాందిశీకులై పోవుట... యశ్వంతసింహుఁడు సంధియొనర్చుకొని పాదుషా దర్బారున కేఁగుట...

అన్నియును... చంద్రరావున కనుకూలములే యయ్యెను. తానాశించిన దే యాయము కొంతలభించినది. ఇఁక మిగిలినది గజపతి కుమార్తె లక్ష్మి తన కిల్లాలు కావలయును. రఘు నీచాతినీచుఁడని సంఘమున నణఁగ ద్రొక్కఁబడవలెను ... లేనిచో... మరణించిననుశుభమే...

రఘు... లక్ష్మి... ఇద్దఱు నొక విప్రునింట నుండిరని చంద్రరావునకుఁ దెలియవచ్చినది. మొగలాయీల దాడు లను మిషతోఁ బల్లెలదోచుకొను నొక దొంగల గుంపుతో చంద్రరావునకు స్నేహమ్మమరినది. కడకాదళమే లక్ష్మి నపహరించితెచ్చి వాని కర్పించి నాణెమ్మైన బహుమతి నందినది...

నూత్న యౌవన విభాసితయు నమాయకురాలగు లక్ష్మి విధిలేక చంద్రరావునకు లోఁగి పెండ్లికి నొడఁబడినది. చంద్రరావు

వ్రాయుచున్న చిఠాలో మఱియొక్క వాక్యము మాత్రము పూరింపఁబడవలె... అదియే... రఘు వినాశనము...

రఘు పితృదేవుని యశఃకాంతులకు నాలంబన మీయ నెంచియో యన ధనురాది సమస్తశస్త్రాస్త్రంబుల నుపయోగించు విన్నాణంబు నెఱింగెను. కరి తురగాది వాహనంబుల నధిరోహించుటలోఁ గూడ నాతఁడు దిట్టయయ్యెను. తత్కాలమున భారతసీమల ననువర్తింపఁబడుచున్న రాజకీయవిశేషముల నతఁడు సాంగముగ తెలిసికొనెను. వాని యంతరంగ మొకటియే ప్రబోధించెను. పర రాజులను హతమార్చ సంఘము నుజ్జీవింపఁజేయుచున్న (శ్రీ) శివాజీ మహారాజు కొలువునఁ జేరుమని యా ప్రబోధము. దేశసేవ యొనర్చుట కిదియే సదవకాశము. భగవంతుఁ డనుకూలించిన నేనాఁటికేని తన చెల్లెలి నన్వేషించుటయు, విధర్ములై తన వంశమున కపచార మొనరించిన యశ్వంతాది రాజన్యులకు బుద్ధిఁ గఱపుటయు, శివాజీ ప్రభృతులకు ముఖ్యుఁడని పేరుఁగాంచుటయుఁ దన కాదర్శములుగ నెంచఁగోరెను. తత్ఫలితమే నేఁడు రఘు శివాజీకి ముఖ్యానుచరుఁడై యొసఁగుట...

చంద్రరావు నోడించి వాని దుర్మార్గానుచరుల ఖండించి జౌలీప్రాంతము నీమధ్యనే శివాజీ యాక్రమించుకొనెను. నాఁటినుండి చంద్రరావు శివాజీ యాజ్ఞానుబద్ధునివోలె నటించుచు, దొంగ ప్రమాణములఁ జేసి యాశ్వికదళాధిపతికి సహాయుఁడుగా నుద్యోగము నందెను. శివాజీచేయు మంత్రాంగముల నెప్పటికప్పుడు ఢిల్లీ పాదుషాకును, తదితర చిన్నినవాబులకును రహస్యముగ వార్తల నిచ్చుచు, భావికాలమునఁ దురుష్కరాజ్యములో నెన్నఁదగు జాగీరు నందవలయునను సన్నాహముల నతఁ డుండెను... పాదుషా

యారంగజేబీ చంద్రరావున కనేక వాగ్దానము లిచ్చియుండెనట కూడ... ఇట్లు లోలోన గోతులుతీయు.భారతవిద్రోహిని శివాజీ యనుచరు లేరును బసికట్ట నేరకుండిరి. అందుచే వీని పాపభాండ మింకను బ్రద్దలుకాలేదు. రఘు దర్బారులో నుద్యోగియైననాఁడే చంద్రరావు కన్ను లెఱ్ఱబడినవి. పాపము రఘు మాత్ర మనుంగు సోదరి నపహరించిన దుర్మార్గుఁ డీతఁడే యని తెలియఁడు. చంద్రరా వంతరంగమం దెన్నియుపాయములనో పన్నుచుండెను. అదునెఱింగి రఘును సమూలముగ నాశన మొనరింప నాతఁ డువ్విళులూరుచునే యుండెను. రఘుయొక్క పౌరుష సాహసములను మెచ్చి నిండు దర్బారున శివాజీ మహారాజిడిన ఖడ్గబహూకృతి చంద్రరావునకుఁ గోయనికోతగా నుండెను. ఆనాఁ డందరిదృష్టులును రఘుపైనే యుండుట, శివాజీ సంపూర్ణహృదయపూర్వక స్వాగతమిడి హవల్దారుగ నియమించుట చంద్రరావునకుఁ గన్నులనుండి తలగనిదృశ్యమై పోయినది. ఇన్నియును వాని మనఃపరితాపకారణములే యయ్యెను. నాతఁ డొకనాఁడేని గృహమున లక్ష్మి కీవిషయమును వివరించలేదు. మాటిమాటి కాయవ్యయపట్టికను మాత్రము చూచుకొనుచు లోలోన నేదియో గొణుగుకొనుచుండును. అమాయకురాలగు లక్ష్మి తనభర్త యేవియో వ్యవహారములఁ జూచుకొనుచుండె నను కొనెడిది. చంద్రరావు కండ్లెఱ్ఱఁబడుటకు మాత్రము కారణమామెకు గోచరముకాలేదు. అయ్యెను... ఆమె యబల... దుఃఖపరితప్త హృదయ... అన్యవిషయాసక్తి లేనిది. ఆనందశూన్యమైన సంసార మామెకు గుదిబండయైనది. తన పతిపైఁ దన కమితమైన కోపము గల్గుచుండును... కాని పూర్వధర్మములన్నియు నామెపై దండెత్తి వచ్చుచున్నట్లు భయము కల్గుచుండును. మాంగల్యము మగువకు

మాయరాని భాగ్యమని యామె విశ్వాసము. తనపతికిఁ గీడుశంకించుట తనకే తీరని యపక్రియయని యట్టిభావమునే తెచ్చెడిదికాదు. ఏమయ్యెను... ఆమె జీవితము నిస్సారమైపోయినది. ఆమె చరిత్ర కుదాహరణము పురాణములలోనే కనరాదు. ఆమెయొక్క మాన జీవిత స్థితిలోనే చంద్రరావు తన పాపపుబండిని పఱువులెత్తించుకొని పోవుచున్నాఁడు.

నేఁడు చంద్రరావు తన కార్యాలయమున నేదియో గతమును బర్యవేక్షించుకొను చున్నాఁడు. దుర్గమును రక్షించుబాధ్యత యంతయు నేఁడు తనపైననే యున్నది. ముఖ్యులందఱును బూనా నగరమునకుఁ దఱలి వెళ్ళిరి... శైస్తఖానును సంహరించి స్వకీయ ప్రతిభనుజాట మహారాష్ట్రు లువ్వెత్తుగ నేఁగుట చంద్రరావునకు సహింపరానిదే యగును. ఈ నిర్ణయ విషయ మాతనికి నవ్యవధిగఁ దెలిసినది. సూర్యాజీ యాకస్మికముగ వార్తలఁ దెచ్చుటచే నిట్టి కార్యక్రమము సాగిపోయినది. ఈ నిర్ణయము ననేకులు తెలియరుకూడ...

శివాజీ ప్రభృతులు పూనానగరమునకు వెడలిన మూఁడు దినములనుండి చంద్రరావు కొండయే పైఁబడినట్లు కుందుచుండెను. రాజకోట సంరక్షణమునకై కా దీబాధ. మొగలాయీలకుఁ దీరని నష్టము వాటిల్లుచున్నదేయని. సత్వరముగ శైస్తఖాను తప్పించుకొను నుపాయము నే స్నేహితుఁడును చెప్పకుండునా యను ధైర్యమప్పటప్పట వానికిఁ గల్గుచుండెను...

ఇంతలో... దుర్గద్వార మాకస్మికముగఁ దెఱవఁబడినది. "జయ్‌భవానీ"యనుశబ్దము మిన్నుముట్టినది. "శివాజీ మహారాజునకు

జయ్"యను నినాదములతో దిక్కు లదరుచున్నవి. చంద్రరావున కున్నమతియుఁ బోయినది. ఇంత త్వరగా జయమునుగొని సైన్యములు మఱలి వచ్చినవా ? జయభేరి మ్రోగింపఁబడుటతోఁ బాటు దర్బారు ప్రారంభింపఁబడు ధ్వనులుగూడఁ జేయఁబడినవి... పౌరులందఱు ఉత్సాహ సంభ్రమములతో దర్బారు వైపునకుఁ బర్విడుచుండిరి. ఎవరేనియుఁ దన మనోవైకల్యము ననుమానింతురేమో యని, దాని లోలోన నణచుకొని చంద్రరావు వచ్చియురాని కంఠమున "జయ్ భవానీ"యనుచు వెడలి శివాజీ వర్గమును గలిసికొని దర్బారునకేఁగెను.

ఉన్నతాసనమున గంభీరమూర్తియై శ్రీ శివాజీదేవుఁ డధిష్ఠించియుండ, ప్రక్క నొక యుచితాసనమున మాతృశ్రీ వసించియుండెను. తదితర ముఖ్యు లందఱును వారివారి స్థలములఁ జేరియుండ దర్బారు నిండు కన్నులపండువుగ నుండెను. పురజను లిసుక వైచిన రాలకుండఁ గొలువు నిండియుండిరి. ఎట్టి విచిత్ర వార్తలు వినిపించునో యని కుతూహలాయత్త చిత్తులై వేచియున్న సభ్యులలో నొక్కఁడేని పరాకుఁ జిత్తగించువాఁడు లేఁడు. చంద్రరావు మాత్రము మబ్బులు గ్రమ్మినవదనమున నొక స్తంభమును జేరి విషయమును వినఁగోరుచుండెను. అంతయు నిశ్శబ్దము. అంతయు విచిత్రవాతావరణము....

శివాజీ యనుజ్ఞను గొని తానాజీ లేచి ప్రజల కిట్లని యుపన్యసించెను. "పవిత్రభారతోద్భవ విలసిత చిత్తులారా! వీరపురుషులారా! నేఁడు మనకొక పర్వదినము. మనజాతి నుజ్జీవింప బద్ధకంకణుఁడైన శ్రీ శివాజీ మహారాజుల కొక జయము లభ్యమైనది. ఈ జయ మొక లెక్కగాదు. ఇటులెన్నియో లభింపవలసియున్నవి. మనలోఁ దగినట్లు

లైకమత్యము, స్వాభిమానము, జాతీయతాభావము కొఱవడియుండుట చేతనే విదేశీయులు మనలను బానిసలుగా నొనర్చుకొనఁదీవ్రయత్నముఁ జేయుచున్నారు. ఏ విషయమునను బరిపూర్ణతఁ గనని యితరజాతులు సంస్కృతిఁగలవని, ఔదార్యాది సాహస గుణములు గలవని, మనలను నమ్మింపఁజూచుట యెంత హాస్యాస్పదమో గమనించుఁడు. మోసమును మనలో మనకుఁ జీలికలుఁబెట్టి వారు మనకు మధ్యవర్తులుగా నుండఁజూచుటయుఁ గొన్నింట మీరెఱుంగుదురు. అట్టిది మనకు సిగ్గుచేటుగాదా ? మొగలాయీ లుత్తరభారతమునంతయు వశపఱచుకొంటిమిగదా యని దక్షిణమును గూడఁ గబళింప నెంచుచున్నారు. గోల్కొండ, బిజాపూరు సంస్థానములప్పుడే మనపై నంకుశము లైనవి. క్రమక్రమముగా భారతదేశము మా మాతృభూమి యనఁ గల్గునంతటి హక్కును వారు సంపాదించుకొనినారు. శివాజీ మహారాజును బంధించుటకై శైస్తఖాను పూనానగరమునఁ గొలఁది దినములనుండి యుండి మనసైన్యములచే నేఁడు బఱువెత్తింపఁబడినాఁడు. ఆ పిఱికిపంద కిటికీనుండి దుముకుచుండ (శ్రీ) శివాజీమహారాజుల భవానీ ఖడ్గమునకుఁ దెగిన వ్రేళ్లైదు నివిగో... ఐదువ్రేళ్లు పోయిన వెనుక నాతఁడు జీవించియున్నను వ్యర్థమే. ఇదే తీరుగా మొగలాయీల నిరంకుశత్వపు వ్రేళ్లు ఖండింపఁ బడనంతదనుక మన మాహార పానీయముల ముట్టమని ప్రతిజ్ఞ నూనవలె... శరీరము లుప్పొంగ మీరలందఱు నొకపర్యాయము "భవానీకి జయ్" యని పలుకుఁడు. కొలఁదిసేపులో మిఠాయీలఁ బంచిపెట్టుదురు. వేచియుండుఁ"డని చెప్పుచు జయనినాదమ్ముల మధ్య తానాజీ యుపన్యాసమును ముగించెను.

తరువాత... శివాజీ యిట్లు పల్కెను. "ఆర్యవంశజులార! ఇయ్యది కేవలము నా జయము కాదు. పవిత్రభారతీయ తత్వము యొక్క జయమిది. ముఖ్యానుచరుల తోడ్పాటు దీనికి ముఖ్యము. శైస్తఖాను పలాయనమును జిత్తగించుట మాట యటుంచి, తత్కాలమున నా ప్రాణరక్షణ మొనర్చిన "రఘు" చిన్నవాఁడయ్యు నాచేఁ బ్రశంసింపఁ దగినవాఁడు. నేను శైస్తఖానుగల భవనమునఁ బ్రవేశించు సరి కాకస్మికముగ శంశేరుఖాను నాపైన నురికెను. వాని ఖడ్గము నన్ను చవిచూచెడిదే. కాని... రఘు వాని నొక్కవ్రేటున యమలోకమున కంపెను. చిరంజీవి రఘు నాశీర్వదించుచు నీ "వజ్రహృదయ" మను కవచమును బహూకృతిఁ జేయుచున్నాను. ఇంతకుఁ బూర్వము చంద్రహాసమును బహుమతినందిన రఘు నేటి కవచముతో నత్యంతముఁ బ్రకాశించునుగాక!...

జనుల కరతాళముల మధ్యమున "రఘు" శివాజీ యిడిన కవచమును గ్రహించెను. తదనంతరము మిఠాయిలు పంచిపెట్టఁ బడినవి. ప్రజ లానందాతిరేకమున శైస్తఖాను పరాజయమును వివిధ రీతుల వర్ణించుకొనుచు గృహాభిముఖులైరి. రఘు శౌర్యమును స్తుతించుటకు వారెంతయు నభిలషించిరి...

ఈ దృశ్యములఁ గాంచినవెనుక... చంద్రరావు హృదయ బాధ వర్ణనాతీతము. వాని యాయవ్యయపట్టికలో మఱియొక "వ్యయము" వ్రాయవలసి వచ్చినది. రఘు సత్కరింపఁబడుట... తన కిది యవమానమేకాక... ఔరంగజేబునకు నింకొక క్రొత్త శత్రువు ప్రచండుఁ డుదయించెనన్నమాట... ఇయ్యది చంద్రరావు హృదయమున నొక యారని మంటయైనది...

## ౫

రఘుతోఁ బరిచయమును సంపాదించిన సరయూబాలలో భావములన్నియు నొక్కపరి మేల్కొన్నవి. అజ్ఞాతముగ వర్తించు నింద్రియములు కల్పనకులోనయి, అవిదిత సంచలన సంతోషముల నందుచున్నవి. రఘుతో నెయ్యము రత్ననిధులు లభించినట్లని సరయూబాల యంతరంగమిచ్చు సందేశము. ఇయ్యది సులభ సాధ్యము కాదని మనస్సంకోచము. ఇచ్చిన వాగ్దానముల మఱచునా యని యొక పూర్వపక్షము. ఆర్యావర్తమునకు సేవఁ జేయు పవిత్రసేవకుఁ డగుట నట్లు చేయలేఁడని మఱియొక భావనాసిద్ధాంతము.

గృహమున నిప్పుడామె ప్రతిపనియందును బరాకుఁ జూపుచున్నది. ఎక్కడివస్తువులక్కడే యుండి సరయూబాలతో సరసములాడుచున్నవి. ఆశ్రమమును వీడి యీవలకు వచ్చిన నారామమునఁ గల ప్రతి లతయును గతమును బ్రశ్నించుచున్నదా యని యామెకు సందియము కల్గుచున్నది. పుష్పము లన్నియు నామెను జూచియే నవ్వుచున్నవని చిరాకు జనించుచున్నది. అంతయును వింత కార్యక్రమమునఁ బడి యేఁగుచున్న సరయూబాల చెయ్దములఁగని ప్రకృతియే పరిహసించుచున్నది. దేనికేనియు నుస్సురుస్సురనుట యింత దను కామె కనుభవము కానిది. అనుదినమును భక్తితోఁ జదువఁబడు భారత గ్రంథ మెచ్చటి కేఁగినదో యామె కింతలో జ్ఞప్తికి రాదు. ఆ గ్రంథమందలి శౌర్యపూరిత రణరంగవర్ణనముల నెన్నియో మార్లు పఠించు నామెకు నిరాధార భావనాపరంపరల నూఁగులాడు కల్పనయె రుచి యనిపించినది. కొలఁది చప్పుడైనను

తన యేలిక వచ్చుచుండెననియే యూహ. ఆకస మొఱయుచుండినఁ బంచకల్యాణి గమనధ్వనియని యామె యంచనా. నామసాదృశ్యమును బట్టి తత్ప్రియోచ్చారణమున కనుబంధించునని యిప్పు డామె సుకుమార కరాంగుళులు వాల్మీకి రామాయణమును వెదకుచుండెను...

జనార్దనదేవుఁ డీవిషయమును గుఱుతింపకయుఁ బోలేదు. తీరని దేశీయ రాజకీయములఁ బరిశీలించిన రాఁబోవు కాలమొక రాక్షసయుగమునకుఁ బ్రాతిపదికగఁ దోఁచుచుండుటచే వాని మనం బన్యథాయత్త మగుచున్నది. భారత సంస్కృతికిఁ బ్రమాదము రాకుండుటకై గురుదేవుఁడు చేయుచున్న తపశ్చర్య యూహాతీతము. ఒక్కొక్కపర్యాయ మథర్వణవేదమును దిరుగవైచును... మఱియొకతూరి పవిత్రహోమానలముఁ బ్రజ్వలించును. ఒక పర్యాయము తీవ్రముగ నాకసములోనికిఁ జూచుచు యోజించును. ఈ నడుమను... రహస్యకేంద్రముల నాత్మరక్షణ దళములకు జాతీయత నుపన్యసింప నేఁగుచుండును. రానురాను దేశస్థితి యయోమయ మగుచుండుటచే సరయూబాల భవితవ్యమును గుఱించి యాలోచింపఁ బ్రొద్దుచాలదు. రాజకీయములఁ బరిణామావస్థలను గురుదేవుఁడు సరయూబాలకు లీలగాఁ దెల్పుచుండెడి వాఁడే కాని నిశ్చయమును నిరూపించువాఁడుకాఁడు. శైస్తఖానుని పరాజయమునుమాత్రము పదింతలుగ వర్ణించి చెప్పెను. అందుల కామె మొగము వికసించలేదు... కాని... ఆ దండయాత్రలో రఘు పాత్రను విపులీకరించుటతో నామె పెదవులు పండు వెన్నెలలఁ గురియించినవి. గురుదేవుఁడు చూడకుండఁ దనగది గోడపై రఘునామము రామకోటిగా వ్రాసిన బాలకు రఘునామ

మామొగుండెలోఁ-దుడువరాని శిల్పాక్షర రూపమైనది. ఆమె కల్పనలో రఘు రొయిలోని ఖడ్గరాజమున మొగలాయీలఁ దూలించుచున్నటులు చిత్రముగాఁ గనవచ్చుచుండును. అట్టి సమయమున... "అబ్బ... ఎంతకష్టము... పరరాజులఁ బాఱఁ దోలుట యన... ఫలాహారముల స్వీకరించుటయా?... ఊఁ... తల... తల... జాగ్రత... ఊఁ... అది... ఆ మొఱకు తురుష్కుని ఖండించుము..." అనుచు నామె రణరంగమునఁ దన ప్రియునికి సులువుల బోధించుచున్నట్లుగూడ నంతరంగమున నటించుకొనును.

కల్పన గానము చేయింపఁగలదు. నటనము నొనరింపను గలదు. అదియే దాని సజీవత్వమునకు లక్షణమని చెప్పియుంటిమి గదా...

ఇట్టి స్థితికిఁ బ్రతిబింబముగ రఘు చరిత్రమున్నది. అనవరతము సరయూబాల సంస్మరణముతోఁబాటు తన కర్తవ్యము నచిరకాలమున ముగించి శివదేవుని యనుగ్రహముతోఁ బాటామెను స్వీకరింపవలయునని యువ్విళులూరుచుండెను. శివాజీమహారాజానందమునఁ బెక్కుమారులు తనకు బహూకృతుల నిచ్చియున్నను, ముందు కాలమున, రాఁదగు యుద్ధకార్యక్రమముల మాట దక్కవలయునుగదా? తొలుదొల్తఁ దనపితృదేవుని హతమార్చిన విజాతీయుల దురహంకారమునకుఁ బ్రతీకారము సల్పుట, తదుపరి శివాజీ మహారాజుల కవలంబనముగ నిల్చి దేశకళ్యాణమును సాధించుట..., ఇట్టి దుస్సాధ్యములగు నాటంకముల నతిక్రమించిన గదా... జీవితకళ్యాణము...

తానాజీ ప్రభృతులగు యోధాగ్రేసరు ~~లెడ~~నెడ నాచరించు సాహస కృత్యముల కబ్బురమందుచు వారివోలెఁ దానును దుర్గా క్రమణముల నుద్వేగ విక్రమములఁ జూపించిననే సరయూబాలకుఁ దానిచ్చిన ప్రతిన నెఱవేఱుటయు నామె సమయోచితముగ రక్త కుంకుమ దిద్ది చేయించిన ప్రమాణము సార్థకమగుటయును సంభవించును. అట్టి సుముహూర్తమునకే యాతఁ డెదురు చూచు చుండెను...

వీరాధివీరుల ప్రలాపములయందు మాటిమాటికి సరయూబాల యిడిన దేశకల్యాణదీక్ష జ్ఞప్తికివచ్చును. స్వీయ చంద్రహాసములో నామె చిత్తరువు ప్రతిబింబించుట కాతఁ డాశ్చర్య పడుచుండును. నవసాంధ్యరోచులలోను, నవకిసలయాంకుశిషులోను బాలయొక్క ప్రౌఢిమ ప్రతిస్ఫూర్తి నీనుట కతఁ డచ్చెఱువందు చుండును. ఒంటరిగ వెలుపలికి నేఁగిన నీడవోలె నామెదృష్టివెన్నాడి హెచ్చరించుచున్నటు లుండుట కతఁడు విభ్రమపడుచుండును. తన కిట్టి నూతనానుభవము కల్గుచుండుట నితరు లెఱింగిరేని పరిహాస ముఁ జేయుదురనియు నాతఁడు శంకించెను...

శైస్తఖాను పరాభవము నందినవెనుక మొగలాయీలు ద్విగుణీకృత కుయుక్తిప్రయత్నులు కాఁగలరని శంకించిన శివాజీ తన బలమును దృఢపఱచుకొనుచుండెను. ప్రతివీరుని విషయమునఁ బ్రత్యేకశ్రద్ధ గైకొనఁబడుచుండెను. రాజకోటలో నాల్గువైపులఁ దగురక్షణదళము లుంచఁబడెను.

మాతృశ్రీ యాజ్ఞ ననుసరించి యచిరకాలమునఁ గళ్యాణ దుర్గము వశపఱచుకొన శివాజీ యుద్వేగమునందుటయు నప్పటికే

సంభవించెను. రక్తపాతము గాకుండ, రణదుందుభుల మ్రోత లేవియు వినరాకుండ, పౌరులకుఁ దదితరులకు నెట్టియపాయము కలుగ కుండ నా దుర్గమును జిక్కించుకొన శివాజీ శతథా యత్నించు చుండెను. సూర్యాజీ, తానాజీ, రఘూజీలవంటి యువవీరుల నిసర్గ శౌర్యబుద్ధి ప్రభావము తన కాసరాగా నాతఁడీ కార్యమునఁ గృత కృత్యుఁడ నగుదునని యే నిశ్చయించుకొనెను.

ఆనాఁటి మంత్రాలోచనమున దీర్ఘకాలము చర్చలు నడిచిన యనంతరము, రాత్రి రెండవయామమున సైన్యములన్నియుఁ గళ్యాణ దుర్గమును సమీపింపవలయుననియుఁ గేవల యుక్తిని, దార్ఢ్యము నటించి యొక్కప్రాణికేని హింస యొనఁగూడనిరీతిని నాటకమంతయు నాడవలయునని శివాజీవర్గమంతయు నిర్ణయించుకొనెను. అనువగు నటు లమ్మ యాశీర్వదించుట, తానాజీ ప్రభృతుల ప్రతిజ్ఞాస్వీకృతితో శ్రీ శివాజీ కార్యక్రమ దీక్షాసంచాలకుండుగా నొప్పెను. శివాజీ రఘును బిలిచి యత్యంతహితమునఁ జేయఁదగు పనుల నన్నిటిని బురమాయించెను. చంద్రరావునుగూడ నాశ్వికదళము నుచితరీతిని సమాయత్తపరుప హెచ్చరించి విశ్రాంతి మందిరమున కేఁగెను.

కళ్యాణదుర్గము తోరణదుర్గమున కనతిదూరమున షాజీ జాగీరునకుదక్షిణముననున్నది. ఔరంగజేబునకన్నిట సన్నిహితుఁడగు మౌలానా అహమదు దానికిఁ బ్రస్తుతము రక్షకుఁడుగా నుండెను. శత్రువుల నెదిర్చి సాహసమున యుద్ధమొనరించుట, గండరగండఁడై తదితరదుర్గముల నాక్రమించుట, మొదలగు రాజలక్షణము లేవియు నాతనిలోలేవు. ఔరంగజేబిచ్చిన విపులసైన్యమాధారముగా నాతఁడా దుర్గమున సౌఖ్యలీలలఁ దేలుచుండెను. సైనికు లిచ్చు ధైర్యముకంటె వానికి సుజీవమునిచ్చు పదార్థములు వేరుగనున్నవి.

అవియేవియున్న - ఔరంగజేబు మహమదునకుఁ బదవి నప్పగించునపుడు "ఓయీ! శివాజీ వర్గమునకు నీవెంత మాత్రమును భయమందవలసిన పనిలేదు. వారిలో చంద్రరావు తదనుచరులు మనపక్షమువారే... వారెప్పటికప్పుడు నీకు వార్తలందీయఁగలరు. తదనుకూలముగ నీవు జాగ్రత్త వహించినఁ జాలును. పరిస్థితి విషమించినచో నే నచిరకాలము మున లక్షలాది సైనికుల నీ రక్షణకు నంపఁగలను!" అని వాగ్దానముల నిచ్చెను. అయ్యవియే యహమదు ధైర్యమునకు స్థిరత్వము నిచ్చినవి. ఔరంగజేబు వివరించినటులనే చంద్రరావువద్దనుండి యెప్పటికప్పుడు రహస్యముగ వార్తలు వచ్చుచున్నవి. అందుచే నహమదు మఱియు విఱ్ఱవీఁగుచు మనోవృత్తి ననుభవించుచు మాన్యుఁ డనిపించుకొనుచున్నాఁడు.

రాత్రి మొదటియామము ముగియకుండఁగనే రాజకోటలో సంచలనము బయలుదేరినది. వీరులందఱు నెవరికి వారే యుద్ధ శస్త్రముల సజ్జీకృతులై త్వరితగతిని దుర్గబహిరంగణమునఁ జేరుచుండిరి. నగర రక్షకు లందఱును వీరాగ్రేసరులను గుర్తించి ముందునకుఁ బోనిచ్చుచుండిరి. చూచుచుండఁగనే సైనికులందఱును కళ్యాణదుర్గము మార్గముఁ బట్టిరి. బహిర్ద్వారమునఁగల ముఖ్య నగరరక్షకునితో నేమియో గుసగుసలాడి యొక రౌతుమాత్రము తనగుఱ్ఱమును మఱియొక మార్గమునఁ ద్రిప్పి కొండలలో నదృశ్యమయ్యెను. చీకటి నలుపులలో సైనికులను వెంబడించుచున్న చంద్రరావీ దృశ్యమును జూచి యేదియో యూహించి మీసమును మెలివేయుటతో నా దృశ్య మదృశ్యమైనది.

రెండవయామమున సైన్యము లన్నియుఁ గళ్యాణదుర్గమును సమీపించినవి. తానాజీ శివాజీలు ముందున కేఁగి పరిసరములఁ

బరిశీలించిరి. దుర్గములోనుండి వెలుపలికి వెలుఁగులు వచ్చుచున్నవి. కోటగోడపై సామాన్య రక్షకులేగాక యదనముగా సైనికులు చాలమంది సాయుధులై కావలిఁగాయుచున్నట్లు పొడగట్టుచున్నది. సమీపారణ్యమునఁ జెట్లతోఁపులో నిలువఁబడిన శివాజీ సైన్యమునకే యీ లక్షణములన్నియుఁ బ్రకటమగుచున్నవి. సన్నసన్నగా దండనాయకుల హెచ్చరికలుకూడ గాలిలోఁ బయనించి శివాజీ తానాజీల కర్ణములఁ దాఁకుచున్నవి. ఇఁక వారికేమియుఁ బాలుపోలేదు...

ఒక్కప్రాణికేని నష్టములేకుండ, నిద్రాసమయమున దుర్గాధ్యక్షుని బంధించుట కెత్తువేచిన శివాజీ రహస్య మీ మొగలాయీలకుఁ దెలిసిపోయినదా? లేకున్న నిట్టి యసమయమున వీరందఱు లాయుధములతో సంసిద్ధముగ నుండఁగలరా? అగుచో... మన రహస్యము నే దుర్మార్గుఁడేని వీరి కందించియుండఁడుగదా!

అర్థముకాని ప్రశ్నలేవియో శివాజీ హృదయమునుఁ జుట్టుముట్టినవి. అసంబద్ధపు సమస్యలేవియో శివదేవుని మస్తిష్కమును వేడెక్కించినవి.

ఇప్పుడు... ఇఁక కాఁదగినది... దుర్గముపై దండెత్తి ముందున కేఁగుటయా? లేక... రాజకోటకు మఱలిపోవుటయా? పురోగమనమో... తిరోగమనమో... ఏది సముచితము?... శివాజీ తానాజీలు సైన్యసమీపమునకు మఱలిరి. నిశ్శబ్దముగ సైనికులందఱు నాకుజొంపముల నెదురు చూచుచుండిరి. రఘుమాత్రము ముందున కళ్ళెముపై దుమికి... కర్తవ్యమును బ్రశ్నించెను. శరీరమంతయు స్వేదము క్రమ్మి, ఉచ్ఛ్వాసనిశ్వాసల

అభిషేమివియ్యన- ఔరంగజే బహమదునకుఁ బదవి నప్పగించునపుడు "ఓయీ! శివాజీ వర్గమునకు నీవెంత మాత్రమును భయమందవలసిన పనిలేదు. వారిలోఁ జంద్రరావు తదనుచరులు మనపక్షమువారే... వారెప్పటికప్పుడు నీకు వార్తలందీయఁగలరు. తదనుకూలముగ నీవు జాగ్రత్త వహించినఁ జాలును. పరిస్థితి విషమించిన నే నచిరకాలమున లక్షలాది సైనికుల నీ రక్షణకు నంపఁగలను!" అని వాగ్దానముల నిచ్చెను. అయ్యవియే యహమదు ధైర్యమునకు స్థిరత్వము నిచ్చినవి. ఔరంగజేబు వివరించినటులనే చంద్రరావువద్దనుండి యెప్పటికప్పుడు రహస్యముగ వార్తలు వచ్చుచున్నవి. అందుచే నహమదు మఱియు విఱ్ఱవీఁగుచు మనోవృత్తి ననుభవించుచు మాన్యుఁ డనిపించుకొనుచున్నాఁడు.

రాత్రి మొదటియామము ముగియకుండఁగనే రాజకోటలో సంచలనము బయలుదేరినది. వీరులందఱు నెవరికి వారే యుద్ధవేషముల సజ్జీకృతులై త్వరితగతిని దుర్గబహిరంగణమునఁ జేరుచుండిరి. నగర రక్షకు లందఱును వీరాగ్రేసరులను గుర్తించి ముందునకుఁ బోనిచ్చుచుండిరి. చూచుచుండఁగనే సైనికులందఱును కల్యాణదుర్గము మార్గముఁ బట్టిరి. బహిర్ద్వారమునఁగల ముఖ్య నగరరక్షకునితో నేమియో గుసగుసలాడి యొక రౌతుమాత్రము తనగుఱ్ఱమును మఱియొక మార్గమునఁ ద్రిప్పి కొండలలో నదృశ్యమయ్యెను. చీకటి నలువులలో సైనికులను వెంబడించుచున్న చంద్రరా వీ దృశ్యమును జూచి యేదియో యూహించి మీసమును మెలివేయుటతో నా దృశ్య మదృశ్యమైనది.

రెండవయామమున సైన్యము లన్నియుఁ గల్యాణదుర్గమును సమీపించినవి. తానాజీ శివాజీలు ముందున కేఁగి పరిసరములఁ

బరిశీలించిరి. దుర్గములోనుండి వెలుపలికి వెలుఁగులు వచ్చుచున్నవి. కోటగోడపై సామాన్య రక్షకులేగాక యధికముగా సైనికులు చాలమంది సాయుధులై కావలిఁగాయుచున్నట్లు పొడగట్టుచున్నది. సమీపారణ్యమునఁ జెట్లతోఁపులో నిలువఁబడిన శివాజీ సైన్యము నకే యీ లక్షణములన్నియుఁ బ్రకటమగుచున్నవి. సన్నసన్నగా దండనాయకుల హెచ్చరికలుకూడ గాలిలోఁ బయనించి శివాజీ తానాజీల కర్ణములఁ దాఁకుచున్నవి. ఇఁక వారికేమియుఁ బాలుపోలేదు...

ఒక్క ప్రాణికేని నష్టములేకుండ, నిద్రాసమయమున దుర్గాధ్యక్షుని బంధించుట కెత్తువేచిన శివాజీ రహస్య మీ మొగలాయీలకుఁ దెలిసిపోయినదా ? లేకున్న నిట్టి యసమయమున వీరంద ఱిటు లాయుధములతో సంసిద్ధముగ నుండఁగలరా ? అగుచో... మన రహస్యము నే దుర్మార్గుఁడేని వీరి కందించియుండఁడుగదా !

అర్థముకాని ప్రశ్నలేవియో శివాజీ హృదయమునుఁ జుట్టుముట్టినవి. అసంబద్ధపు సమస్యలేవియో శివదేవుని మస్తిష్కమును వేడెక్కించినవి.

ఇప్పుడు... ఇఁక కాఁదగినది... దుర్గముపై దండెత్తి ముందున కేఁగుటయా ? లేక... రాజకోటకు మఱలిపోవుటయా ? పురోగమనమో... తిరోగమనమో..., ఏది సముచితము ?... శివాజీ తానాజీలు సైన్యసమీపమునకు మఱలిరి. నిశ్శబ్దముగ సైనికులందఱు నాకుజొంపముల నెదురు చూచుచుండిరి. రఘు మాత్రము ముందున నశ్వముపై దుమికి... కర్తవ్యమును బ్రశ్నించెను. శరీరమంతయు స్వేదము క్రమ్మి, ఉచ్ఛ్వాసనిశ్వాసల

మృత్యుపాతలూఁగుచున్న గుఱ్ఱమును దానిపై నుద్వేగమును జూపు చుండిన రఘును జూచుటతో శివాజీకి నొక యూహ స్ఫురింపక పోలేదు. ఈ వీరులందఱును, ఈ అశ్వములన్నియును, దుర్గముపై నెపుడు దూకుటయా యని యుద్రేకమునందుచున్నటు లాతఁడెంచెను... కాని... అయ్యది యన్యాయ మనక తీరదు.

దుర్గమున కాశించి మొగలాయీలతోఁబాటు తదితరులను బాధించిన విజయసంతోషము కలుగనే కలుగదు. అహమదు నొక్కని బంధించిన, ఒకరిద్దఱు దుర్గరక్షకులను బట్టివైచిన దుర్గము హస్తగతము కావలెను. వృథగా నీ రక్తపాతములను సృజించనేల? గోటితోఁ బోవుదానికి గొడ్డలియేల?

స్వసైన్యమును రాజకోటకు మఱల్పుమని శివాజీ తానాజీ నాజ్ఞాపించెను... ప్రభూ! అని యతఁ డేమియో వచింపఁజూచెను గాని... శివాజీ దీర్ఘాలోచనమున నదియేదియు విన్పింపలేదు. విధి లేక తానాజీ సైన్యమును వెన్కకుఁ బో సంజ్ఞఁజేసెను.

తలచినకార్యమును సాధింపక రిక్తహస్తములతో వెనుకకు వచ్చిన యనుభవము శివాజీ జీవితమున నిదియే తొలిసారి. ఇంత దనుక యనేక క్లిష్టపరిస్థితుల నెదుర్కొనుట సంభవించెనుగాని... ఇట్టి విఘ్నమెన్నఁడును గలుగలేదు. అందులకై యాతఁడు విచారించుటలేదు. తన రహస్యముల నెవఁడో విద్రోహి శత్రుల కిచ్చుచుండెనను ననుమానము మాత్ర మతనిని వేధించుచున్నది. అట్టి సంశయము పుట్టుటతో, శివాజీ యొడలు కంపమెత్త నారంభించెను. హృదయ మగ్నిని బొరలించుచున్నటులు బాధ కల్గుచుండెను.

భారతమాతృపదసేవ కుంటువడఁజేసిన, తన కార్యక్రమము నీరీతిని భంగ మొందింప నుంకించిన పరమకిరాతకుఁ డెట్టివాఁడై

యుంచునా? అతఁడు భారతీయుఁ డనుపదమున కర్హుఁడేనా? మాతృదేవత సన్నిధినిఁ బుత్త్రుఁడనని చెప్పుకొనఁదగు లక్షణమాతని కుండి యుంచునా? ఏదియో యిట్టి దుష్కృత్యము జరిగియుండనిచో వారంత సంసిద్ధముగ నుండఁగలరే? వారి నిట్లు మేల్కొల్పి కరముల ఖడ్గములందిచ్చిన కలికి మొలి కెవఁడై యుండును...

ప్రాగ్దిక్కున నరుణకిరణములు పొడఁగట్టుటతో శివాజీ తన కార్యక్రమమున కుద్యమించెను. ముఖ్యసేవకునిఁ బిలిచి పరివార మందఱును దుర్గాభవనమున నత్యవసరముగ సమావేశమగుటకు సూచనఁజేయు భేరిని మ్రోఁగింపు మనెను. ఆ నినాదముతో... రాజకోటనుగల పురుషు లందఱును నా భవనమున హాజరు కావలసినదే. చిన్ని సేవకుఁడు మొదలు నాయకుల పర్యంత మందఱును దుర్గసన్నిధి నుండవలసినదే... నాల్గు నిముసములలో నొక ముఖ్య విషయమును శివాజీ చర్చించఁగలఁడని దుర్గమంతయుఁ దెలిసిపోయెను.

ఈ సమావేశమునఁ జర్చనీయాంశ మేదియో యని తానాజీ ప్రభృతు లచ్చెరువందుచుండిరి. గడచిన రేయియంతయుఁ గునుకు లేక పరిశ్రమించిన సైనికులందఱీ హెచ్చరికకు భయము నందిరి. ఎట్టి విషాద పరిస్థితి యేర్పడనిదే శివాజీ మహారాజ్ సూచనను జేయించియుండఁడు. సమావేశము దుర్గసన్నిధిని... అనుటలో వారందఱును మఱింత కంగారైరి. విచిత్ర పరిస్థితులలోను, విషాద సమస్యలలోను, శివాజీ దుర్గసన్నిధి రక్తారుణిమ నేత్రములతో మాట్లాడు ఘట్టములెన్నియో మనవారెఱుఁగుదురు. అగుచో నేఁటి విచిత్ర పరిస్థితి యేమి? నేటి విషాదసమస్య యేమి? రాత్రియొనర్చిన తిరోగమనమా...అందులకు శివాజీయే యాజ్ఞాపించెనుగదా! కాకున్న

...ఎట్టి యగ్నుల నుఱుకమన్నను... అందఱును సంసిద్ధులే కదా....ఇది యేమి విచిత్రమో యెవ్వరు నెఱుఁగరు. అచిరకాలమున నందఱును దుర్గాభవనమున కఱుదెంచిరి.

ఓ వీరులారా! మీరందఱును భారతమాత కనుఁగుబిడ్డలనియు దేశసేవకులనియు నా విశ్వాసము. అటులనే మీ రెల్లఱును... ఒకానొకనాఁడు దేవీసన్నిధిని బ్రమాణముల స్వీకరించిరి...అట్టిచో... మన రహస్యములను శత్రువుల కందించు నీచులు మనలో నుండిరనుటయు నమ్మరాని విషయమే ... అయ్యును... రాత్రి మన కార్యభంగమున కర్థమున్నదా? తప్పక ద్రోహి యొకఁడు మనలో నుండెనని నా యంతరాత్మ యేలకో బాధించుచున్నది. కావుననే మీరిటఁ బిలువనంపఁబడిరి. క్షణకాలమున నాత్మను బ్రశ్నించుకొని యా ద్రోహి ముందునకువచ్చి యపరాధమును స్వీకరింపవలయును. లేనిచోఁ బరిణామ మూహింపరానిది...

శివాజీ నోటినుండి వెలువడిన ప్రతిశబ్దము వీరులహృదయముల మ్రోఁగించెను. ఎచ్చట నోటిచప్పుడు లేదు. ప్రతివ్యక్తియు గుండెపైఁ జేయివైచుకొని ప్రశ్నించుకొనెను. కాని పై ప్రశ్నము నకు సమాధానము దాపునలేదు. ఎవరా ద్రోహి? ఎవరా నీచుఁడు? ... ఇట్టి ప్రశ్నములనే ప్రతిహృదయమును బ్రతినినదించెను...

"సమాధానము నీయలేరా? నేనే యన్వేషింపఁగలను." శివాజీ యుఱిమెను. సభయంతయు నిశ్చంచలము. "స్వీయదోషము నంగీకరించుట సజ్జనలక్షణము. పొరపాటువడుట సామాన్యమానవలక్షణము. మించినదిలేదు... అట్టి ద్రోహి ముందునకు రావచ్చును..."

పశ్చాత్తాపమును సూచించిన శిక్షయుండదు... శివాజీ యుద్వేగ మునఁ బలికెను. సమాధానము నా సభ యీయలేదు.

ఛీ...ఛీ... పిరికి కండలు... స్వీయవర్గమున కరిష్టమును గల్పించి, మాతృదేవి నెత్తినిమన్నుఁజల్లు మూర్ఖులు రహస్యముగనే బ్రతుకవలెను. స్వేచ్ఛాశూన్యులు, పరుల పాదరక్షలుమోయ నిచ్చగించు పాపులకు స్వర్గమునఁ దావులేదు. నాకన్నులఁగప్పు నా దురాత్ముల యాయుర్భాగ్యము క్షణికము... దుర్గ యట్టిద్రోహిని భస్మముచేయక విడువదు... శివాజీ యుపన్యాసము పగిలిన యగ్నిపర్వత విధము ననుకరించుచుండ... సభలో నొకవ్యక్తి నిలువఁబడెను... అందఱి దృష్టు లతనిపైఁ బడెను. శివాజీ యుపన్యాస మాఁగెను. ఎవరది ? చంద్రరావు... శివాజీ సాభిప్రాయముగఁ బ్రశ్నించెను.

ప్రభూ! ద్రోహిని నేనుగాదు. ఎఱిఁగిన సంఘటనమును దెలియఁజేయుట యుక్తమని నిలిచితిని. రాత్రి మనము ససైన్యముగా దుర్గాక్రమణమునకుఁ జనుచుండ నొక యువకుఁడు మనలోనుండి జీలి మూఱు ద్రోవఁ బట్టెను. అతఁడెవరో నేనుజెప్పిన నమ్మరేమో... ద్వారరక్షకుఁడు శరభోజీనిఁ బ్రశ్నించినఁదెలియఁగలదు...చంద్రరా వాఁగెను.

"ఎవరా యువకుఁడు ? నీవే చెప్పరాదా ?" శివాజీ తొందఱగాఁ బ్రశ్నించెను. చంద్రరావు విషమునవ్వును బఱపుచు నట్టి మూర్ఖుని పేరు నుచ్చరించుట నాకేల ? ద్వారరక్షకుఁడే చెప్పఁగలఁ డనుచు నాడంబరభావమునఁ గూర్చొనెను... ఏమి చంద్రరావు పౌరుషము ? అట్టి మూర్ఖుని నామమునే యుచ్చరింపఁ డేమి ? అందఱు నాశ్చర్యపడిరి... అగుచో నెవరా ద్రోహి ?

సభలో మఱియొక వ్యక్తి తలవంచి నిలువఁబడెను. అందఱును జూచిరి. ఎవ రాతఁడు? రఘు... శివాజీకి ముఖ్యానుచరుఁడు... రఘు...

రఘు! నీవేనా మాఱుత్రోవఁబట్టిన యువకుఁడవు?... శివాజీ ప్రశ్న... ప్రభూ! ఔను... కాని... రఘు నోటినుండి మాటరాలేదు.

ఎంతటిఘోరము! ముఖ్యానుగాములలోనే యిట్టి విద్రోహమా? సభ్యులందఱును ఱిచ్చవడిరి... ఇతఁడిట్టి స్వల్పబుద్ధియని మేము తలంపనేలేదే యని కొందఱు ప్రకటముగనే యనిరి.

అనేక సాహసకార్యముల ముందంజవైచి బహూకృతుల నందిన రఘు మాతృద్రోహమున కొడిఁగట్టునా? నిన్న మొన్న శైస్తఖానుపై జరిగిన యుద్ధ సంఘర్షణమున శివాజీ ప్రాణములనే కాపాడిన మేటివీరుఁ డిట్టి హాస్యాస్పదకృత్యమును సల్పఁగలఁడా? ఏమో యెవరు సమాధానింపఁగలరు?...

కోట వెలుపల మాఱుత్రోవఁబట్టిన రఘు కళ్యాణదుర్గ సమీపమున సైన్యమునకు ముందేయుండెనే? శివాజీనిఁ గర్తవ్యమేమని ప్రశ్నించెనే? అంతయు వింతగనున్నదే?... మాఱుత్రోవ నతఁడు ముందేఁగి దుర్గములోనికిఁ జెప్పివచ్చెనా?...

"నీవు మఱియొక త్రోవ నెచటి కేఁగితివి? ఏ మొనర్చితివి? దేశద్రోహి వను నారోపణమునకు సమాధాన మీయఁగలవా?" శివాజీ స్ఫుటముగ నక్షరములనన్నిటి నొత్తి ప్రశ్నించెను.

నేనెచ్చటికి వెడలినదియు వివరింపఁజాలను. వివరింపరాని దది యని చెప్పినందులకు నన్ను క్షమింతురుగాక. నేనొనర్చిన దేశద్రోహ-

షేమియు లేదు. అట్టి నీచమున కొడిగట్టువాఁడనని మీరు తలంచిన నా దురదృష్టము. దీనికి భవిష్యత్తే సమాధాన మీయఁగలదు." రఘు వినమ్రతను మృదుస్వరమునఁ బల్కెను. అతఁడట్లు శిరమును వంచుకొనియే నిలువఁబడెను.

శివాజీకి సందేహమధికమాయెను. అతఁడంతటి చెప్పరాని కృత్యమేమైయుండును ? భవిష్యత్తు సమాధానమిచ్చునా ? తానే యెందులకు జవాబీయరాదు. రఘుపై శివాజీకిఁ బూర్వమునఁగల గౌరవమంతయు నిముసమున రూపాంతరము నందెను. ఇతరవర్గము యొక్క దృష్టిలోఁగూడ రఘు చిత్రమొక విరూపముగఁ గనవచ్చుచుండెను...

"రఘూ ! నీ వా విషయమును విపులీకరించకున్న ద్రోహివనియే లెక్కింపఁబడుదువు. దుర్గసన్నిధి నీవు రహస్యమును దాచరాదు. నీ కైదునిముసములు సమయమీయఁబడుచున్నది. ఉత్తరక్షణమున భవానీయాజ్ఞకు నీ వొదలవంచవలసినదే... తరువాత నీ యిష్టము"... శివాజీ యుద్రేకమున ననెను.

రఘు నడిసముద్రములోఁ బడినటులాయెను. ఏమి సమాధాన మీయవలెను ? యుద్ధమున కేఁగుచుఁ దనప్రియురాలగు సరయూబాలను గలియనేఁగితి ననుటయేనా ? సరయూబాల తనకుఁ బ్రియురాలా ? జనార్దనదేవుల కాగ్రహమేకల్గునో, శివదేవు లెక సక్కెముఁ జేయుదురో, తదితరు లపహాస్యమొనరింతురో, తనయాత్మ పవిత్రతను వెల్లడిఁజేయుటకై యొక విరియని బాలహృదయమును ద్రుంపి ప్రకటించుట... ఒకరూపమునందని ప్రణయగాథను బలువురిలోఁ బెట్టుట...

చంద్రరావెట్టిప్రమాదమును దెచ్చెను. చంద్రరావెట్టి విషోరగసమస్యను రేకెత్తించెను ? దీనివలనఁగల్గు ప్రయోజనము? అతనితోఁ దనకేమేనియు వైరముండెనా? ఆ వైరము పూర్వజన్మలోనిదికాదుగదా!... రఘు భావములు నిరాధార దిగంతరాళమున ఱెక్కలువిప్పి యెగురఁజొచ్చెను. ఆ భావములు నిలువఁద్రొక్కుకొన నొక్క యాధారమేమియు లభింపదు. ఏమిచేయవలె ?

శివాజీ యిచ్చిన గడు వైపోయినది. రఘు తనప్రణయరహస్యమును వెల్లడింపకుండుటకే నిశ్చయించెను. ప్రళయమే వచ్చినను సరయూబాల వృత్తాంతమును నిండుసభలో నసమయమునఁ బ్రకటించుట కాతని యంతరంగ మిచ్చగింపలేదు.

"నీవు మా దృష్టిలో ద్రోహివైతివి. దుర్గయనుగ్రహమునకు దూరమైతివి. నీవు గడచినకాలమున నొనర్చిన సేవల జ్ఞప్తినుంచుకొని, యిఁకమీఁదట నీవు మాపరిసరముల నుండరాదని, సరిహద్దులను బదిగడియలలో దాటి నీవు పోవలెనని యాజ్ఞాపించుచున్నాము. శిరము ఖండింపఁదగిన శిక్షకు దేశ బహిష్కరణము శిక్షవైచితిమి. నీవు వెంటనే యీ ప్రదేశమును విడువవచ్చును." శివాజీ యుగ్రదృష్టులఁ దీర్పు విన్పించెను. సభలోని వారందఱు నుఛ్వాసలనుగూడ బిగించిరి.

"ప్రభూ! సెలవు. నా జీవితమున నొక్క రక్తబిందువేని శేషముండుదనుక మాతృదేవతకు సేవఁ జేయఁగలనని మఱల మఱల విన్నవించుచున్నాను. ఎప్పుడేనియు ప్రాణములు దుర్గపాదముల సన్నిధిని వీడవలసినదే. ప్రభువులకు ననుగ్రహము కల్గినపుడే యీ ప్రదేశమునకు రాఁగలను. నేను భగవతి దృష్టిలో

నిర్దోషిననుచు విన్నవించుకొని మీ యాజ్ఞ సౌదల వహించుచున్నాను." రఘు మెల్లగా సభను వీడెను.

ఈ సంఘటనమున కానందించవలయునో, ఆవేదన మందవలయునో, తానాజీ ప్రభృతుల కర్థముకాలేదు. జిజీబాయినోట మాటలేక యటులనే కూర్చొని దుర్గనామమును జపించుచుండెను. చంద్రరావానందమున గృహోన్ముఖుఁడయ్యెను. తన యాయవ్యయ గ్రంథమున నాయమును జేర్చు నదవకాశము చిక్కినది. దీనితో రఘు శంకరగిరి మాన్యములఁ బట్టవలసిన దే... ఎన్ని పర్యాయములు రఘు యభ్యుదయమును జూచి తన దృష్టులు కంటగించుకొనెనో... దానికనువగు చల్లఁదన మిప్పుడు లభించినది. ముందేమగునో చూతమని వానివాంఛ...అంతియే కాని తానే యహమదునకుఁ గబురంపి శివాజీ యాశయము నంతను భగ్నపఱచిన కుతంత్రమేనాఁడేనియు బైటపడునేమో యను భయమాతనికి లేదు. కర్మసాక్షి యన్ని కృత్యములను లోకులకుఁ జెప్పఁగలఁడను విశ్వాసము చంద్రరావున కేకోశముననను లేదు. ఇటులనే శివాజీ వర్గమునఁగల రహస్యములను మొగలాయీల కెప్పటికప్పు డందిచ్చి భావికాలమున నౌరంగజేబిచ్చు సన్మానమునందవలయునను దురాశ వానిలో నింతింతై విశాల విశ్వరూపము నందుచుండెను. తన పాప భాండము పగిలి చరిత్రలో శతధా శకలములుగా వికృతీకరింపఁ బడునను దీర్ఘదృష్టి లేకుంటచేఁ జంద్రరావీ దృశ్యమున కమందానందమందెను. గృహలక్ష్మి యగు లక్ష్మికీ విషయమును, దన విజయమును వేనోళ్ళ వర్ణించి, తెలియఁ జేయవలయునని నడకను వేగ మొనరించెను...

తదితర సైనికు లర్థముకాని భావములతో వారి వారి విడు దుల కేఁగిరి... శివాజీ మాతృశ్రీ పాదపంకజముల శీర్షమువంచి యాశీస్సుఁ గోరెను...

దుర్గ శిరోభాగమునందలి యొక పూజాకుసుమము క్రిందికి జారినది...శివాజీ జిజియాల దృష్టి కియ్యది తగులక పోలేదు...

మౌనమున వారిరువురు నిశ్చేష్టులైరి...

## ౬

ఎన్నఁడు నానంద మన నేమియో మొగమునఁ గనరాని చంద్రరావు నేఁడు నవవికసితమగు మంకెనపూవు వంటి మొగముతో నింటికివచ్చి "లక్ష్మీ" యని కేకవైచుట లక్ష్మికి వింతయయ్యెను. తన నొక బానిసపిల్లవలెఁ జూచువాఁడీనాఁడు విచిత్రస్వరమునఁ బిల్చుట యామె కంతరంగమున వేదనఁ గల్గించెను. అతని సహజస్వభావ మును జులుకనగఁబోల్చుకొనఁగల్గు శక్తి యామెకెప్పుడో యలవడి నది. ప్రియురాలు, అర్ధాంగి మొదలగు పదములు తన జీవితమున కన్వయింపకుండ విధినిర్ణయించెనని యామె యెన్నఁడో నిశ్చయించు కొన్నది. అయ్యును దానొక పురుషునకు లోఁబడి యుండవలసిన సతి యను విషయమామె విస్మరింపఁజాలదు. అందుచేతనే విపరీత కళ్మలభావముల పుట్టయగు చంద్రరావు నవలంబన మొనర్చుకొని వానినే తన దైవముగనెంచి పూజించుకొనుచున్నది. ఆరాధనము తన కర్తవ్యము కాని యాయవ్యయముల విచారము తనదికాదని యామె యెఱుఁగును. నిజమైన సతీలలామ లక్షణమంతియేకదా !

లక్ష్మీ ! నేటికి నా జీవితాశయముల మూఁడింట రెండుపాళ్ళ జయము కల్గెనన్నమాటయే. నిన్ను నీవు పరిపూర్ణముగ నెఱుంగు

దుపు గదా! నీతండ్రి నన్నెటుల ధిక్కరించెనో వివరించితినిగదా... దానికిఁ బ్రతిఫలమే నీవు నా యిల్లాలివగుట... మీ తండ్రికిఁ దిలోదకముల నిచ్చు నర్హతఁ గలవాఁడొకఁడు గలఁడని నీకుఁ దెలియునా ? వాఁడే రఘు. వానికీనాఁడు పదవీచ్యుతి, దేశ బహిష్కారణము శిక్షవడెను. మఱియు... కొద్దిదినములలో లోకము విడువవలయునను శిక్షయు లభింపఁగలదు. ఇది శివాజీ యాజ్ఞ. అట్టి శిక్షయిప్పించిన దిట్ట (శ్రీ) (శ్రీ) (శ్రీ) చంద్రరావుగారు" అనుచు నాతఁడాయవ్యయముల పొత్తమున "రఘు పదవీ భ్రష్టుఁడు" అను నక్షరములఁ జెక్కి ముద్దుపెట్టుకొనెను. అతఁడు పిచ్చిగ నవ్వుచు నఱచుచు నా ప్రతిజ్ఞ నెఱవేఱె ననుకొనుచు విఱ్ఱవీగిపోయెను.

లక్ష్మికి మతిపోయెను... రఘు... ఎవరా రఘు... తన యన్నయా? ఇచ్చట నెందులకుండెను?... కడచిన విషాదచరిత్ర యంతయుఁ గన్నులకుఁ గట్టుటతో నామెకుఁ గథయంతయుఁ బోధపడినది. తనను జోరు లపహరించినతరువాత... అప్పుడే పదేండ్లు జరిగిపోయినవా?... రఘు శివాజీకొలువునఁ గుదిరెనా?...ఐన... తన భర్త వానికెట్టి యిక్కట్టును గల్పించెను?

అనునయముగఁ జంద్రరావును బ్రశ్నించి లక్ష్మి కథయంతయు రాఁబట్టినది. మొగమున నిసుమంతయేని విషాదమును గనరానీయక తన గదిలోనికేఁగి యాలోచనము సాగించినది.

ఇప్పు డామెకు రెండు సమస్య లుత్పన్నమైనవి. రఘును రక్షించుకొనున దెట్లు? తనభర్తపై నాగ్రహించిన రఘునుండి చంద్రరావును గాపాడుకొనునదెట్లు? ఈ కుట్రకుఁ జంద్రరావు కారణమని యెఱిఁగిన రఘు వీని రక్తమాన బ్రతినబట్టకుండునా? రఘు పట్టుదల వహించిన నెట్టివాఁడో లక్ష్మికిఁ జిన్నతనమందే తెలియును.

సునిశిత భావనల యందుగాని, సూక్ష్మోపాయముల శత్రునిగ్రహ మందుగాని రఘు భావికాలమున మహాయోధులలో లెక్కింపఁబడు నని తమ కాశ్రయమిచ్చిన విప్రుఁడు జ్యోతిషము వచించిన దిన మామె హృదయమునఁ జెరిగిపోలేదు. రఘువంటి యోధుఁడు సజీవుఁడై క్షేమముగ నుండెనను సంతోషముకంటె... అనతికాలమునఁ జంద్రరావు జీవితము సమాప్తమైపోవునేమో యను విచారము లక్ష్మి మనస్సును బీడించెను...

తన భర్త యెంతదుర్మార్గుడైనను జిరాయురున్నతినిగని తన మైదువ తనమున కెట్టి కళంకమును రాఁగూడదని భావించుట భారతీయ లలామలలో ముఖ్యాశయ మనునది యసత్యకల్పనము కాదు. యుగములు తాఱుమారైనను, జగములు స్థానభ్రంశము నందినను, భర్త యాయుర్భాగ్యమునకుఁ దపించిన సాధ్వీమతల్లు లీయార్యావర్తమున నెందఱో గణింపనలవికాదు. అట్టిచో లక్ష్మి కీగుణ మసహజ మనరాదుగదా!... చంద్రరావు విశ్రమింపనేఁగుటఁ గని లక్ష్మి మేలిముసుఁగు వైచుకొని యసమయమున నుద్యాన వనము వైపు పయనించినది. రాజమార్గము ననుసరించి నగరము పొలిమేరలకు వ్యాపించియున్న చిట్టడవియే యీ యుపవనము. పండ్ల నిచ్చు వృక్షములకంటె కట్టియలనిచ్చు కల్పకము లీవనమున నధిక ముండెను. పూవులు లభించుట కష్టముకాని... ముండ్లుమాత్రము విచిత్రతరగతులకుఁ జెందిన విచ్చటఁ దొఱుకఁగలవు. విశ్రాంతి నభిలషించు నొండురెండు ప్రాణులు మాత్ర మప్పుడప్పు డీ చిట్టడవిని పరిభ్రమించుచుండును. విహారమను మిషమున నొండురెండు జంట లిచ్చట కలియుచుండుటఁబట్టి విహారవనమను బిరుదనామము దీనికి దక్కెను:

లక్ష్మి మనస్సును గుదుట బఱచుకొనుట కిచ్చటికిఁ జేరలేదు- విహరించు కుతూహలము గల్గు సమయమా యిది ? దినకరుఁడింకను బశ్చిమమునకు వ్రాలి నాల్గుఘడియలు కాలేదు. ఎండవేఁడిమికిఁ బ్రాణులన్నియు వ్యథ నందుచున్నట్లు నీడలంజేర నారాటపడు చుండెను. ఆకులును విలాసముగ నాడుకొను జల్లగాలులు లభింప కుండుటచేఁగాఁబోలు చైతన్యములేనివివలెఁ జేష్టలు దక్కి యుండెను. దేశబహిష్కరణము శిక్షగాఁగొన్న రఘు దుర్గమువీడి చనునెడ నీ రాజమార్గముననే పోవునుగదా ! దైవవశమున నట్లు సంఘటితమైనఁ దాను వానిని బిలిచి మాట్లాడవచ్చునను నాశయే లక్ష్మి నిచటికిఁ దెచ్చినది...

అన్యోన్యబాంధవ్యము గల్గినహృదయము లప్రయత్నముగఁ దారసిల్లఁగలవు. దూరమునుండియే భావిని నిర్ణయించుకొనఁగలవు- మానవయత్నమున నట్టి సంఘటనములు జరుగుననుట వితండ వాదము. అంతఃకరణముల కన్యోన్యమెట్టి వాసనాపరంపరగలదో... అయ్యది ప్రకృతిలో నెట్టి బంధనముల బిగింపఁగలదో... వానిభావ పరిణామ మేయాధారము ననువృత్తమగుచుండునో ప్రాజ్ఞులు తెలియఁ గలరు. పామరుల కయ్యది హృద్యముకాదు. దానిని గాకతాళీయ మనుఁడు... అదృష్ట మనుఁడు... ఆదిశక్తివలన ననుఁడు... మతే మనుఁడు... సామాన్యుని దృష్టికందని దీనిలోనే సృష్టిరహస్య మున్నది.

పరిపక్వస్థితినందని పడుచుఁదనపు బింకములోఁ గష్టములకు స్వాగతమిచ్చిన రఘు తన చరాస్తినంత నొకమూటఁగట్టి, రాజ కోట నీక్షణముననే విడుచుచుండెను. కఠోరమైన శిక్షనిచ్చిన శివ దేవునిలో నాతని కిసుమంతయైన జెడ్డ కనుపింపలేదు. దుర్గసన్నిధిని

దనకట్టి శిక్షవడుట కేదియో భగవంతుని యాదేశ మొకటియుండు నను పవిత్రభావపు వెలుగునీడ లేవియో వానిలోనికిఁ దొంగిచూచి నవి. చంద్రరావువంటి నీచునివలన నెప్పటికేని శివాజీవర్గమునకు ముప్పురానున్నదను సందియముతోఁబాటు కొలదికాలములోఁ జంద్ర రావును వధించి తన నిజమైన దేశభక్తిని బ్రజాహృదయమున నంకిత మొనర్పవలయునను దీక్షయు నతనిలో జనించెను. దర్బారులో నుండికంటె వెలుపలనుండియే శివాజీ మనస్సు నాకర్షింపవలయు నను గుతూహల మాతనికి బలమిచ్చెను.

బరువుగల భావములఁ దేలియాడుచు నస్తవ్యస్తగతుల నతి శీఘ్రముగా రాజవీథిని నడచుచున్న రఘు చెవిలో "అన్నా" యని సన్నముగాఁ గోమలధ్వని యొండు వినిపించినది. ఆకు జొంపముల నుండియే కోయిల యిట్లు పిలుచును? సమస్తబంధువులకు దూరమైన తన నాహ్వానించుప్రాణి యీ లోకమున నేదియుండును?

మేలిముసుఁగున నాకాంత యుండి మఱల "అన్నా" యను టలో రఘు హృదయమునఁ జేయివెట్టి కలచినట్లైనది. ఎన్ని యేండ్ల క్రితమో దొంగల చేతిలోఁబడి యదృశ్యమైన లక్ష్మి కాదు గదా యీమె... ఒక్కయుదుటున రాజమార్గమును వీడి వన ములో నడుగుంచిన రఘు సుందర వదనారవిందమున దీనదృక్కులు బఱపు నా జవ్వనిని గాంచి విభ్రాంతిలో మునిగెను...

క్షణకాలము రెండు గుండెలనెట్టి విచిత్ర జ్ఞాపక సముద్రములు కెరటములు వైచెనో... ఎట్టి గతస్వప్నములు ప్రత్యక్ష రూపము నందెనో... లక్ష్మి యని రఘు... అన్నాయని లక్ష్మి... యొండొ రుల కౌఁగిటిలో దుఃఖాశ్రువులఁ దొప్పదోఁగిరి... అన్నా... చెల్లెలు... ఎన్ని సంవత్సరములకుఁ గలయిక... వారి వాత్సల్యము... అభి

మానము... నాల్గు నిముసములఁ దనుక నమరలోకమునఁ దేలించెను. జీవితకాలమున వారిరువురుఁ గలసికొందుఱనుట యసంభవమనియే నిరాశఁ జేసికొనిరి. భగవంతుఁడు నేఁ డిటుఁ గూర్చెను... తల్లిదండ్రులను బోఁగొట్టుకొని చెఱియొక దిక్కున దిక్కులేక విడివడిన యేకగర్భ జనితుల చిరకాల సంయోగమునకు నెట్టి సుఖానుభూతి లభించునో... ఎవరు వివరింపఁగలరు ?...

రఘు, లక్ష్మి ధరించిన వేషభూషాదులంబట్టి యొక్క సహృదయు నింట సౌఖ్యము నందుచున్నదని యానందించెను. ఆనందము మువ్వెత్తుగ రాఁగా తద్విషయమునే ప్రశ్నించెను గూడ... లక్ష్మి మాత్రమట్టి ప్రశ్నలకు సమాధాన మీయకుండఁగనే యన్న చేతిలోఁ జేయినుంచి నా సౌఖ్యము, నా యైదవతనమందే యున్నదని విశ్వాసమున్న నీవు నాకొక వరమీయ వలెనని హృదయావేగమున నడిగెను. ఇట్టి నిరాధారస్థితియందును దాను చెల్లెలికి వరమీయఁగల యర్హతలో నుండెనా ? ఏమి యావరము ?... తప్పక యీయఁగలనను నిశ్చలవాక్య మాతని నోటినుండి వెలివడుటకు మెలికలు దిరిగినది. సగద్గదికముగా... "చెల్లీ ! అపహాస్యమా ! నే నీయఁగల వరమేమి?" అని యతఁడున్నతమస్తకుఁడై ప్రశ్నించెను.

"చెల్లెలి సౌభాగ్యమును రక్షించుటకై నీవు వాగ్దానమీయ లేవా ?" యని లక్ష్మి దీనముగ వేఁడుకొనెను. "అదియేమి చెల్లీ ! నా ప్రాణములనైన నిచ్చి నీ సౌభాగ్యమునకుఁ బ్రాణము వోయఁగల"నని రఘు లక్ష్మి చేతిలోఁ జేయివైచి ప్రమాణ మొనర్చెను." దుర్గసాక్షిగా నీవు ప్రమాణమును నెఱవేర్పుము. కఠిన ప్రతిజ్ఞను నీ పీకకుఁజుట్టి నీ యభ్యుదయమునకు నవరోధమైనందులకు క్షమింపుమని లక్ష్మి భోరుమని రోదించెను.

రఘుకున్న ధైర్యము సడలుచున్నట్లయ్యెను. ఏమి యీ విచిత్ర సంఘటన మనుకొనుచు లక్ష్మి నోదార్చుచు విచారించు టకుఁ గారణముఁ దెలుపుమని నెమ్మదిగఁ బ్రశ్నించెను.

లక్ష్మి క్లుప్తముగఁ బూర్వకథ వినిపించెను. తాను రఘు నాశించుచుండిన సౌఖ్యముల నందుటలేదనియు నవియన్నియు కుహనాభోగములనియు నైనను బాణిగ్రహణానంతరము భర్తను దైవముగాఁ బూజింపవలసినదే గదా యని నచ్చఁబల్కెను.

తన ప్రత్యర్థియగు చంద్రరావునకర్ధాంగి లక్ష్మి యను మాట రఘు చెవిలో గింగురుమనుచుండెను. కర్తవ్యమేమియో తెలియక విభ్రమమున మునిగిపోయిన యన్నను "అన్నా! ఇయ్యది ప్రమాద కర ప్రదేశము. నీవు సముచిత రక్షణప్రదేశమున కేఁగి చిరంజీవివై యుండిన నీ చెల్లెలికిఁ బ్రాణములిచ్చిన వాఁడవగుదువు. ఇతరులు చూచిన ..నీ దృశ్య మపార్థమునందగలదు" అని వివరించి వెడలి పొమ్మని వేగిరించెను.

రఘు జీవితాకాశములో శుభగ్రహముల సయ్యాటములే సాగుచున్నవో దుష్టగ్రహముల సంకులసమరమే సాగుచున్నదో... అర్థమగుటలేదు. ఆనందమో... విషాదమో తన్నలముకొన్నది... బోధపడదు.

కంటికి మంటికి నేకధారగా స్రవించుచున్న దుఃఖాశ్రువుల నార్ద్రమైన కరకమలములు విడిచినవి. బలవత్తరమైన విధియేదియో రెండుప్రాణులను వేఱువేఱు మార్గములకు నడిపించుటతో వాతా వరణమంతయుఁ బొగగ్రమ్మినట్లైనది.

లక్ష్మికిచ్చిన వాగ్దానము స్పృహకువచ్చుటతో వింత సమస్యలో మునిగెడి మనస్సు సరయూబాల జ్ఞాపకముతో వెఱ్ఱిగా భ్రమించును...

సరయూబాల...లక్ష్మి...ఉభయులకిచ్చిన ప్రతిన నెఱవేరిన నాఁడే జీవితము సార్థకము కాఁగలదు...తోడ్తో శివాజీ సన్నిధి నాత్మ పరిశుద్ధిని బలపఱచుచుఁబల్కిన పల్కులు కార్యరూపము నందవలె. ఇన్నిఁటి కుపాయము...

సత్యము...శాంతి...అహింస...ఇవియే జీవన తరణోపాయములని వచించు జనార్దన దేవుల దివ్యసందేశము ... ఆమార్గమున దీక్ష స్వీకరించిన దాని 'కీయన్యమార్గముల నేలయన్వేషింపవలెను? ఆత్మశుద్ధితో నెట్టికార్యమ్మునైన సాధింపవచ్చునని గురుదేవుల మహోపదేశముగదా ... ఆత్మరక్షణదశముల కనేకములకు నిత్య స్వచ్ఛసౌశీల్యము నలవఱచుటలోఁ బేరెన్నికఁ గన్న శాంతినికేతన పీఠాధిపతికిఁ దాను ముఖ్యశిష్యుండగుటయే యెనలేని గర్వ కారణమైనది. జనార్దనదేవుల విగ్రహము, వారి ప్రబోధములు, ప్రత్యక్షమగుటతో గడచిన గడియలలోని దుర్దృశ్యములన్నియు విస్మరింపఁబడినవి. ఆత్మీయతపోదీక్షకై రఘు నాత్మ పరితపించుచుండెను. అంతతో వాని పురోభాగము వెల్గులతో నిండి గమ్యస్థానము నిర్దేశింపఁబడినటు లానందము కల్గి రఘు నడక వేగమయ్యెను.

జనార్దనదేవులను దర్శించి స్వీయగాథ విన్పించుకొనవలయునను నాశ జనించినదికాని... ఆగాథ విన్న సరయూబాల యెట్టి దుస్థితికి లోనగునో యను సందియము వానికి భయావహమైనది. అందుచే నట్టి కృత్యమున కొడంబడని రఘు కొండత్రోవఁబట్టి యెచ్చటికో మాయమైపోయెను....

లక్ష్మి యెట్టి యౌదార్యమున రఘు చేతిలోఁ దన ప్రాణములు పోకుండ శ్రీరామరక్ష యొసర్చెనో చంద్రరావెఱుఁగఁడు... లక్ష్మి తనచేతిలోని కీలుబొమ్మ యను చులకన భావమే వానిలోఁ గూడు కట్టుకొన్నది. అనవరతము శివాజీ వర్గమునకుఁ గీడుశంకించుచు మొగలాయీలకు విశేషము లందించుట తోడనే వానికిఁ బ్రొద్దు గడచుచుండెను. చంద్రరావు యోధ వీరుఁడని దేశభక్తుఁడని పైవారు తలంచునట్లు నటించుటలో నాతఁడు నేర్పరి. శివాజీ వర్గము ముందు మొగలాయీలను దూషించుట కొకవింత వాఙ్మయమును నుపయోగించుచు మొగలాయీలను దుదముట్టించకున్న భారతమున కన్యథా శరణం నాస్తి యని యాతఁడు బల్లగుద్ది నాదించునపుడు కనుగొన్న కళారాధకుఁ డెవ్వఁడేని విభ్రమమందకపోఁడు...

నేఁడు తెల్లవారుటతోఁ జంద్రరావుయొక్క ముఖ్యానుచరుఁడు రామోజీ విచిత్రవిశేషములను వినుపించెను. సమీప పర్వత సీమలలో శాంతినికేతనమున్న యునికియు, జనార్దన దేవుల దీక్షాదక్షతయు వివరించెను.

రామోజీ గడచిన దినమున వేఁటకై యా కొండలనడుమ దిఱుగుచు నయ్యాశ్రమమును గాంచెనట... శివాజీకి ముఖ్యానుచరుఁడనని చెప్పుటతో నచ్చట నపారగౌరవము లభించుటయేకాక జనార్దన దేవుల రహస్యములన్నియుఁ దెలిసెనట... జనార్దనదేవు లేకాంతమందిరమునఁ దపస్థితినుండుటచే సరయూబాలయే తనకన్ని విచిత్రములను వినిపించినదట... మొగలాయీల పునాదులను మొదలంటఁ బెకలించుటకై యాత్మరక్షణాదళము లెన్నియో జనార్దనదేవుల యాధ్వర్యమున వివిధప్రదేశముల శిక్షనందుచున్నటులా కోమలియే వచించెనట..... అన్నిటికంటె ముఖ్యము...

సరయూబాల సౌందర్య మిట్టిదని మహాకవులును వర్ణింపలేరని రామోజీ చంద్రరావునకు చెప్పెను...

చంద్రరావూర్ధ్వలోకపు టాలోచనములఁ దేలిపోయెను. ఆత్మరక్షణ దళములా ? శాంతినికేతనములా ? సరయూబాల సౌందర్యమా ? ఇన్నిఁటి సారాంశమును దెలిసికొనియే తీరవలయునని యాతఁ డంతరంగమందే నిర్ణయించుకొనెను... అతి జాగరూకతతో శివాజీ ప్రభృతులకుఁ దెలియకుండ నొక కార్యక్రమము నతఁడు సాగింపనెంచెను... అన్నియు నగ్ని రగిలించు నూహాలు...

తానాజీ ప్రభృతులిపుడిపుడే కొలువున నడుగుంచిరి. అందఱు నాసీనులైన వెనుక వినోద సంభాషణములు సాగినవి. చంద్రరావు సాహసమున రఘు ప్రవర్తనమును వెలువరించి రాజ్యగౌరవమును రక్షించెనని సూర్యాజీ ప్రశంసించుటతో నందఱు నౌనౌననిరి. చంద్రరావానందమునకు సీమలులేవు. "అది యేమంత సాహసము. దేశద్రోహమున కుద్యమించు చెనటి బుద్ధుల నెన్నడేనియు రూపుమాపివేయుటయే మన కర్తవ్యముగదా" యని యాతఁడు గాంభీర్యమును నటించెను. శివాజీ మాత్ర మీ సంభాషణమును విననియట్లే యన్యమనస్కతను జూపెను. రఘు విషయమునఁ దానేదియో తెలియని యపరాధము నొనరించినట్లే శివాజీ శంకించుచుండెను. అయ్యును... జరిగినదాని కేమిసేయవలయును ? రఘు దేశద్రోహి యని సభయంతయును సమ్మతించెనే...

శైస్తఖాను నపజయమును వారింపలేకపోయినను గళ్యాణ దుర్గ రక్షణమునఁ గార్యసిద్ధినందిన చంద్రరావు మనఃప్రవృత్తి నను మానించు జీవి యా పరిసరముల లేకపోవుటతో వానిగర్వము ద్విగుణీకృతమయ్యెను. అతఁడు శివాజీని జూచి "ప్రభూ! మొగ

లాయీలలో స్వల్పకాలమున నంతఃకలహములు సంభవింపఁ గలవు. చిన్న చిన్న దుర్గములనుగాపాడు నహమదువంటి నవాబులే ఢిల్లీకేంద్ర ప్రభుత్వముపైఁ దిరుగు బాటు లేవనెత్త నుద్యోగింతురు. నేను వచించు రాజకీయ భవితవ్యమును మీరు యథార్థముగఁ గనుఁగొను నప్పుడు తెలియఁగలరు. మీరు తలచినటు లీ భారతమంతయు మీ పాదగ్రముల మోకరిల్లఁగలదు. మే మెల్లరమును మీ యాజ్ఞను శిరసావహించి పునీతులమైతిమి. పవిత్రభారత పునరుద్ధరణము జరుగునుగాక" యని చంద్రరావు సహజధ్వనులనీనని పల్కులతో నుపన్యసించినను సూర్యాజీ ప్రభృతు లానందించిరి.

వాని యుపన్యాసమున నన్యాపదేశ మేదియో స్ఫురించు చున్నదని శివాజీ యనుంగు చెలికాఁడును గవియు నగు భూషణుఁ డనుమానించి శివాజీచెవిలో నేదియోయూదెను. అంతట శివాజీ...

చంద్రరావూ! భారతమంతయు నా పాదాగ్రముల మోకరిల్లఁగలదని ప్రశంసించుచున్నావు. అయ్యది నింద్యాభిప్రాయము. అట్టి దురాశామనస్కుఁడై పదవీవ్యామోహమున నీశివాజీ కత్తిపట్టి యిట్టి యుద్యమమునకు నాయకత్వము వహించుచుండెనని యెవరైనఁ దలంచుచుండిన వారు తప్పుత్రోవ నున్నారనక తీరదు. సత్యము, శాంతి, అహింస, పునరుద్ధరింపఁబడి గోపూజలు నిర్విఘ్నముగసాగి, భారతసంస్కృతి స్థిరత్వమునందుటకై మనమందఱమును గృషిసల్పుచున్నాము. ఈ మహాయజ్ఞమున మన మెల్లరమును ఋత్విక్కులముమాత్రమే. ధర్మదేవతయే సోమయాజి. ప్రాచీనసంప్రదాయసూక్తులే మంత్రములు. భారతద్రోహులే పశువులు. కావున నీవు యావనాతిరేకమునఁ బల్కినపల్కులను నేను జింతించు

చున్నాను. ఆ మాటల నుపసంహరించుకొని సత్ప్రచారమును జేయుట యుచితమనెను...

చంద్రరావు మొగము కందగడ్డవలెనైనది. శివాజీ యుపన్యాసముతో వాని యంతరంగమేలనో బోర్లపడినటు లయ్యెను. శివాజీ ప్రసరించిన గాఢదృక్కుల సన్నిధిఁ జంద్రరావు వెలవెలవోయి "నా పల్కుల నుపసంహరించుకొనుచున్నాను" అనెను. వాని కంఠమునఁ దీవ్రాభిమానమేదియో ప్రస్ఫుటించెను.

మధ్యాహ్న భోజనసమయమును సూచించు ఘంటారావము పరివ్యాప్తమగుటలో నాఁటి సామాన్య సమావేశము ముగిసెను.

## ౭

వినువీధిఁ జంద్రుఁడిప్పుడే మబ్బువెడలి నాలుగడుగులు వైచెను. శాంతినికేతన ప్రాంగణమందలి సన్నజాజులేలనో వెల్లవోయినవి. పడినది మంచు కొద్దియైనను లతాగ్రములనుండి నీటిబొట్టులు సుస్పష్టముగ రాలుచున్నవి. ఒండు రెండుకుందేలు పిల్లలీపొదనుండి యా పొదకుంటికిఁ బయనించుట వల్లఁగల్గిన శబ్దము వినా యితరనినాదము లా పరిసరముల వినరావు. మందారముమీఁదినుండి పూవుల యరుణకాంతులు స్వీయప్రచారమున కుద్యమించి వైఫల్యమునందుచుండెను. ఆకసమందలి రిక్కలన్నియు జరుగఁబోవు మహానాటక మేదియో చూడ నౌత్సుక్యముఁజూపు ప్రేక్షక దృష్టులను బోలుచున్నవి. ఆశ్రమాంతరమున జ్యోతియొకటి తనపాత్రను ముగించి యదృశ్యముగాఁ గోరుచున్నది. పరిశీలించినఁ బ్రతియణువున నేదియో గంభీర భావమొండు మెఱయుచున్నది...

జనార్దనదేవు లే గడియను రఘు శిక్షింపఁబడుటవినిరో యప్పటినుండియు మౌనముద్రలో నేదియో యోజించుచుండిరి. శివాజీ వర్గమునఁగల ప్రతివ్యక్తియు నేదేనొక సమయమునఁ దనను దర్శించియే

యుండెను. అగుచో... చంద్రరావెవండు? వానియాకారమెట్టిది... వాని ప్రవర్తనములో స్వచ్ఛత యుండెనని విశ్వసించుటకు శివాజీ వానిని బరీక్షించి యుండెనా? న్యాయశాస్త్రము కనుమఱగి మన వారెన్నడును నడిచియుండలేదే? సమగ్రపరిశీలనములేని కృత్యములు రాజకీయమును సమయించునుగాని సమగ్రజయమున కుపకరింపవే... ఇట్టి యాలోచనములలో గురుదేవులు శాంతినికేతనమున నేకాంత దృష్టినుండిరి...

సరయూబాల కంటికి మంటికి నేడ్చుచు దేవమందిరమున నేలను దొఱలుచుండుట నేఱును గనరైరి. రఘు యకారణముగ శిక్షనందుట ఆమెగుండెకొక కశాఘాతమైనది. ఆ దెబ్బకు సొమ్మసిల్లినఁ బ్రాణము లీపట్టున నేఁడేరునను విశ్వాసము కనరాదు. మాతృభక్తి మూర్తీభవించిన వీరుఁ డొకఁడిట్టి యవమానమును సంఘమున నందుట యనునను భవ మామెకు నరికోత్తమైనది. విజాతీయుల దృష్టిలోఁదామిట్టి హైన్యము నందుచున్నటు లామె భావించుచున్నది. కాని స్వసంఘమందే ద్రోహులు కొందఱు దాఁగియుండిరని యామెకుఁ దెలియదు. తానైనను రఘు కర్తవ్యమార్గమున కడ్డు రాలేదే? దేవీ ప్రసాదమున దేశకళ్యాణము సాధించిన వెనుక... రఘు సామీప్యమును గోరెనుగాని... నేఁడే దేశసేవకు విఘాతముఁ గల్పింపనెంచనులేదే... ఉభయుల పవిత్రభావములును నేఁడిట్టి మలీమసవాతావరణమున కగ్గమౌనని యూహింపలేని సరయూబాల తనజీవితమున కిఁక పున్నమ లేదనియే నిశ్చయించుకొనెను. జనార్దనదేవులు మాత్ర మేమి యోదార్పునీయఁగలరు? వీరి ప్రణయలత చిగిరించి, సుమించి, వాసించఁ గృషి సల్పినదని వారెఱుఁగుదురో లేదో... ఇట్టి విపత్సమయమున నాకథ వినిపించినవారేమి వ్యాఖ్యాన మిడుదురో...

ఆశ్రమమునఁ గల యుత్తరభాగముల నెన్నఁడును బౌరతులు దర్శించి యుండరు. ఈసన్నని వెన్నెలనే యూపనిఁజేయుట యుత్తమ మనుకొందును... రండు..... అదిగో... ప్రాగ్భాగమున మాకందమహాముఱుగునగల పర్ణశాల ...ఆ కాషాయ వస్త్రములలో జ్ఞానజ్యోతులవలె వెలుమూర్తులు... ఉపనిషత్తులఁ గల నుత్తమరహస్యములఁ జర్చించుచున్నారు... ప్రాచీన మహర్షుల సంప్రదాయ ధర్మములఁ గ్రోడీకరించి సామాన్యులకును నందుబాటులోఁ బ్రచార గ్రంథములు వ్రాయ గురుదేవులచే నాజ్ఞాపింపఁబడిన... వారి జీవితములు ధన్యములు... అటు కొద్దియోసరిలి నడువుఁడు... అది కళామందిరము... చిత్ర కళాకుశలుర యాత్మీయ తపస్సు రూపందిన తావది. కుంచె నాడించుటలో, రంగులు సింగారించుటలో, వారిది పవిత్ర భారతీయ సంప్రదాయము... దాని నభ్యుదయ మందించుటలో వారు నిరంతర కృషిసల్పుదురు బొమ్మలగీయుట కాదర్శము కుత్సితభావ చిత్రీకరణము గాదు. దుష్క్రియాకలాప సంపీడిత స్త్రీపురుషుల నగ్న చిత్రములు వారిదృష్టికే భయమందునవి. శివుని సంధ్యానృత్యము, శ్రీకృష్ణుని రాసక్రీడ, శ్రీరాముని విజయవిలాసము, అర్జునుని గీతాభ్యాసము, ఆదిశక్తి విశ్వరూపము మొదలగు పూత సన్నివేశములఁ జిత్రించి జాతికిఁ బ్రాణముపోయుట కళాకుశలి కర్తవ్యమని వారు విశ్వసించియే యీ యాశ్రమమునఁ దపము సాగించుచుండిరి. ఆ వామపార్శ్వమునఁ గల పూరిపాక యేమని మీ యభిప్రాయము? నాదబ్రహ్మము నర్తించు నాట్యశాల యది... సంగీత సాహిత్యముల ననగిపెనగి మనోవృత్తమునకుఁ దన్మయీభావము లభింపఁగల భరతాచార్యుల ప్రాచ్యశాస్త్ర మిచ్చుటనే యభ్యసింపఁబడుచున్నది. తారుమారుగఁ దైతక్కలాడి, మద్యపానమున మైమఱచి, మానవత్వమునే విస్మరింపఁజేయు కుహానానాట్యముల కిక్కడఁ దావే

లేదు. శృంగారగేయములనుగూడ భగవంతుని లీలలలో ననువర్తింపఁ జేసి రససిద్ధితోఁబాటు నపవర్గ సిద్ధి నందించఁగల సంగీత శాస్త్రము నశింపకుండ జనార్దనదేవు లీ ప్రచారమునకు నష్టము కట్టిరి... ఆమూాల... తాలింఖానా... కుస్తీమూర్ నా... మజా ఉడానా... "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్" అను నీతికి స్థిరత్వముఁ గల్పించిన దీ యాశ్రమమే... సంధ్యాసమయముల నాశ్రమవాసులిచ్చట బెబ్బులులవలె వ్యాయామమునఁ గ్రీడించుట మీారఁజూడఁగలరు... లలితకళలను, రాజకీయములను, మతసిద్ధాంతము లనేక సూత్రమున బంధించిన శాంతినికేతన మిచ్చు దివ్య సందేశము... సత్యంవద... ధర్మంచర... అహింసావ్రతంస్వీకురు... అనియే. అన్యమతములఁ గని యేవగించకుము. ఆత్మీయప్రతిభను విస్మరింపకుము... మాతృదేశ ద్రోహమునకుఁ గడంగకుము... ఇవియే శాంతినికేతనాధ్యాపకుల యమరసూక్తులు...

శివాజీ కీయాశ్రమదర్శనమనిన శరీరము పులకించును. మనస్సు వేగిరపడును... అట్టిగడియ తనజీవిత భాగమునకొక యమూల్యమైన దని, అట్టి దినము యుగమునకొక పర్వదినమని శివాజీ గణించుకొను చుండును. జనార్దనదేవుల పూర్వాశ్రమకథ నెవరునెఱుంగరు... కాని... వర్తమానదీక్షాప్రకృతిని మాత్రము శివాజీ వర్గమువారు చవిఁజూచియున్నారు. ఇట్టి పవిత్రమూర్తుల యవలంబనముననే తన విజయసిద్ధి యవతరించవలయునని శివాజీ యభిలాషము...

దాదాజీకొండదేవు, సమర్థ రామదాసువంటి పరమజ్ఞాన మూర్తుల గురుత్వములో నేర్చినది జనార్దనదేవుల దివ్యసన్నిధి నతఁడు ప్రత్యక్షము నొనర్చుకొనెను. మనసు పరితపించు వేళల మాతృశ్రీ యాజ్ఞనంది శివాజీ శాంతినికేతన భూభాగములఁ దలఁ దాచుకొనుచుండును. ఆశ్రమమందలి యందఱి నాతఁడెఱుఁగఁడు

గాని జనార్దనదేవుల పాదపద్మములు మాత్రము వానికిఁ జిర పరిచితములు.

తన నియమితకాలము గతించుటతోఁ జంద్రుఁడస్తమించెను. ప్రపంచమునఁ జీకటితెర వేయఁబడెను. ఇంకను రేయి సగము గడువ వలసియున్నది... అంతలోఁ బ్రశాంత వాతావరణమునఁ జిచ్చు రగుల్కొన్నది. ప్రాంతపర్వతములన్నియుఁ బ్రతిధ్వనించినవి. కులాయముల నిద్రఁదోగు పక్షులన్నియుఁ గకావికలై దిక్కుమఱచి యెగిరినవి. పొదరిండ్లన్నియు నూఁగులాడి జంతుసముదాయమును బహిరంగమునకు నెట్టినవి... అంతయుఁ దలవనితలంపు. శాంతినికేతన భూభాగములలో రక్కసులవంటి తురుష్కులు పల్వురు ప్రవేశించిరి. ఆయుధముల తళతళలు... అగ్నిజ్వాలల భుగభుగలు, ఆర్తనాదముల హాహాకారములు,... రూపమూహింపరాని యేదుష్టశక్తియో తన కరాళజ్వాలాజిహ్వల నాశ్రమమునంతయు నాకివైచినది...

భయంకర నినాదముల మధ్యమున బ్రహ్మాతపస్సమాధినుండి కన్నుతెఱచిన జనార్దనదేవులకుఁ బ్రత్యక్షమైనది యెనమండ్రు మొగలాయీ రాజబంధువులు. రక్తసిక్తములైన వారి శరీరములు గురుదేవులదృష్టిలో మెఱసినవి. వినాశనమున కుద్యమించిన వారి యాయుధములలో ధర్మదేవత తొంగిచూచినది. భీకరముగా బరువు పాదముల ముందునకుఁ జనుదెంచు నా ముష్కరులు జనార్దనదేవుల యొక్క సింహనాదముతోఁ బదిగజముల వెనుకకేఁగి నిలిచిరి. వారిని నఖశిఖపర్యంతము పరిశీలించిన గురుదేవులకుఁ జరిత్రయంతయు నర్థమైనది. ఏ మాతృదేశద్రోహియో శాంతినికేతనవార్తల నీతురుష్కుల కందిచ్చియుండవచ్చును. దాని పరిణామమేయిది...

మొగలాయీలు ముందున కుఱుకఁబోయిరి. జనార్దనదేవు హెచ్చరించుచు నిట్లనెను...

ఓయీ! నికృష్టుల నీచకార్యములకు నివ్వెఱపడు నీరసుఁ డనుగాను. పవిత్రతమ శాంతినికేతనములఁ దురుష్కుల పాదఘట్టనలు ప్రతినినదించవలయునని విధి నియమితము కాఁబోలు. అన్యదేశాక్రమణములఁ బొట్టవోసికొని బ్రతుకు జాతులను గొన్నిఁటిని సృజించియుండుటలో ధాత వ్రాత కర్థమేదియో యుండును. ఆధ్యాత్మిక పుణ్యభూములలోనేగదా దేవదానవ సంఘర్షణములు జరిగినది. ఇట్టి యగ్నిపరీక్ష లీ యార్యావర్తమున నిఁకెన్ని దినములు సంభవించునో...కానిండు...మీ వధోద్యోగము నిరంతరాయముగ సాగనిండు. మిమ్మెదుర్కొని యుద్ధమొనరించు నేర్పు నాకుఁ గలదు. కాని... మీ పాపమును బండించుటకై యాత్మత్యాగమునకే యొడంబడుచున్నాను. జాత్యుద్ధరణమునకై యెవనిరక్తము చిందింపఁబడునో వాని జన్మము సార్థకమైనది. ఇట్టి కాళరాత్రమున నేకాంతాశ్రమమున పలువురు దుర్జనులచే హతమొనర్పఁబడిన నా భౌతిక శరీరము నశించునుగాక... నా యాత్మాభిలాషముమాత్రము చిరజీవమునంది మొగలాయీల బర్బరదారుణముల నదలించు తుఫాను కాఁగలదు. నిష్కామయోగమున నింద్రియచాపల్యము నశించిన యీ బడుగుబాపని హత్య దేశశాంతి నాటకమునకు నాంది యగుగాక...

అటు లనుచునే శ్రీ రామనామస్మరణముతో గురుదేవులు కన్నులు మూసెను. తురుష్కుల యాయుధము లన్నియు నొక్కపట్టి వానిపై వ్రాలెను. ఆయుధములు పడుటకుముందే వానిలోని ప్రాణపక్షు లెగిరిపోయెనేమో... రక్తముచింది ధారగా మొగలాయీ సామ్రాజ్య విచ్ఛిత్తిని సూచించు వలయములను జిత్రించెను.

కళామందిరములు, దేవమందిరములు, నశించుటతోఁ దురుష్కులు వచ్చినపని ముగిసినది... కాని... మాటిపొక్క పని...

"చంద్రరావువారన్న సరయూబాలయెక్కడ ?" అని యొకఁడు ప్రశ్నించుటతో నన్వేషణ మారంభమైనది. మంటల మ్రగ్గిపోయెనో తదితరులతోఁబాటు తనువు దొరఁగి చిన్నిచిన్ని శకలములయ్యెనో ఎందేని ఱెక్కలువిప్పికొని యెగిరిపోయెనో... మృగ్యము...

అంత వారి నాయకుఁడిట్లనెను... "చంద్రరావి రహస్యముల వెల్లడించినందులకుఁ బ్రతిఫలముగ నీమె నీయవలయును గదా... ఇపుడేమి చేయుట ?"

దండనాయకుఁడగు యూసుఫ్ వాని చెవిలో నేదియో యూదెను. అంతలో వారందఱును జీకటిలో మాయమైరి. యూసుఫ్ చెవిలో నూదిన దేమాయని చదువరుల సందియము... సరయూబాలకు బదులుగా వారిదివరకు బందీగాఁ బట్టితెచ్చిన నొకయనాథ బాలను సమర్పించినఁ బీడపోవునుగదాయని వానిసలహా. సరయూబాల ముక్కుమొగ మెఱుఁగని చంద్రరా వేమి చేయఁగలఁడు. అందులకే వారందఱు నన్వేషణమును విరమించి వెనుదిరిగినది...

అరుణోదయ రేఖలు పరివ్యాప్తమగుచుండు సమయమున సరయూబాల యొక పల్లెకుఁజేరినది. ఆ పల్లెపేరు శివనాథము. అదృష్ట మేమన నచ్చటి వారందఱును రైతుబిడ్డలే... సత్యసౌశీల్యములకు సరిహద్దులగు రైతులనుజేరి తలదాచుకొనవచ్చునని ధైర్యమామెకుఁ గల్గినది. గ్రామములో నడుగుంచుటతోడనే శివాలయ సామీప్యమున మధుసూదన పండితుని దర్శనము లభించినది. ఆమె మూఁడుముక్కలలో దనకథ యతనికి వినిపించుట తోడనే యా పండితుఁడామె కాశ్రయ మీయ నీయకొనెను...

కాందిశీకుల .. కడగండ్ల నెన్నింటినో ప్రత్యక్షానుభవమున నెఱిఁగిన మధుసూదన పండితుఁ డామె యతిశయించి చెప్పనక్కఱ లేకుండగనే సరయూబాల సంరక్షణమున కొప్పెను. రైతులతోడ్పాటున

నా పండితుఁడిచ్చట ప్రజోపయోగకర సౌకర్యముల నెన్నిఁటినో చేయించెను. దేవాలయము, పఠనమందిరము, వైద్యశాల, విద్యా భవనము, సత్రము మొదలగునవి గ్రామమునకు లేకున్నఁ బ్రయోజనములేదని రైతులందఱకు నచ్చఁబల్కిన ఘటికుఁడతఁడు. అన్నిఁటికిఁ దగినట్లు గ్రామమునంటి పాఱుచున్న కొండవాగు రైతుల సౌభాగ్యదేవత యనవచ్చును...

సరయూబాల యిప్పుడీ గ్రామమున శాంతినికేతనమునందు సౌఖ్యానుభూతులనే యందుచుండెను... కాని... జనార్దనగురు దేవుల యమృతవాణి జ్ఞప్తికి వచ్చుటతో నాయమ మధుసూదన పండితునివైపు జాలిగఁజూచును. ఇద్దఱి కెంతయంతరము ? ఒకరు పాలసముద్రము... ఒకరు నిర్మలసరోవరము... ఒకరు వెన్నెల... ఒక రుషస్సు... ఒకరు జ్ఞానజ్యోతి... మఱియొకరు... ఔదార్యమునకుఁ బోలిక...

పర్వతాగ్రమునఁ జెట్టుకొమ్మపై నిద్రించుచున్న రఘు... అశ్వముల గిట్టల చప్పుడునకు మెలకువవచ్చి చూచెను. శాంతి నికేతనమును ధ్వంస మొనరించి యేఁగుచున్న తురుష్కులు సంభాషించుచు నడచుచుండిరి.

రఘు శరీరము వేడెత్తినది. జరిగిపోయిన సంఘటనమును నిముసములోఁ బసికట్టి యాయుధముపైఁ జేయి వైచెను. ఱెప్పపాటులో విసరఁబడిన చంద్రహాసమున కిరువురి తల లాకసమున కెగిరినవి. ముందేఁగుచున్న నహాముదున కీ ఖడ్గమెక్కడ నుండి వచ్చెనో బోధపడలేదు. అన్వేషించుట కవకాశము చాలదు. ఆలసించినఁ దనశిరమున కేమి భంగము కల్గునో...

గుఱ్ఱములను వేగముఁ జేయుఁడని సైనికులను హెచ్చరించెను. సైనికు లా చీకటి వాకలో గాలితో మాట్లాడిరి. రఘు

వృక్షము దిగి చంద్రహాసమును జేతఁబట్టి శాంతినికేతనము వైపు నకుఁ బదములు సాచెను.

ఉషఃకాంతు లుర్వరకు దిగుసమయమున కాతఁడు శాంతి నికేతన ప్రాంగణమున నడుగుంచెను. జగత్ప్రళయమునకు మచ్చును జూపు నా దృశ్యము మనస్సును గరుడుకట్టించెను. చైతన్యస్రవంతు లారిపోయిన శూన్యశరీరమచ్చట నిలువఁబడిపోయెను. నేత్రములు కరుణరసమును గురిపించుటకు మారు పొగలుచిమ్మ మొదలు పెట్టెను... అంతయును విషాదాంతము...

ఖండఖండములైన పవిత్రాశ్రమభాగముల కళాజ్యోతులఁగని దుర్మార్గుల కృత్యములకుఁ గ్రమము నూహింప రఘు ప్రయత్నించెను. కొలది కొలదిగా మస్తిష్కము పనిచేయుట మొదలుపెట్టినది.

రఘు కన్ను లటు నిటు వెదకినవి... పరమ మహర్షి... శాంతిదూత... ధర్మజ్యోతి... భూదేవత యవలంబనముగాఁ గ్రింది కొఱిగియుండుట నాతఁడు గాంచెను. గురుదేవుల హృదయమునుండి స్రవించిన రక్తధారలు భూమినంకితమై యేమో యుచ్చారణఁ జేయుచున్నవి. రఘు గురుదేవుల పాదముల వ్రాలి నిశ్చేష్టుఁడై యుండి పోయెను... అటులెంతకాలము గడచెనో...

ఆ శూన్య చైతన్యములోనే యెవరో తట్టి లేపినటులై రఘు కన్నులు విప్పఁబోయెను. కన్నులు విడివడలేదు. ఇంకను... ఆ శీతల కరమటులనే వీపుపై రాయుచు హెచ్చరించుచున్నది.

"రఘు! ఏల విచారించెదవు? నీ వేవిషాదముల గుఱించి విభ్రమ పడుచుంటివో వానినన్నిటి సమాధానింప శ్రీ శివాజీ మహారాజు నిశ్చయించెనుగదా! వాని కృషిలోఁ దోడ్పడి భారత మాతృ విషాదమును దొలగింపుము. నీ ప్రతిజ్ఞను నెఱవేర్పుము.

ఎవరీ హెచ్చరిక నీయునది... సరయూ... అంతరార్థమైన సరయూ... ఔను... వారిరువురు నదియేగదా కాంక్షించు నది... ఆ భావనా స్రవంతిలో నొక కెరటము లేచినది... ఏమది... గురుదేవుల యాశీస్సు... రఘు సరయూలను హెచ్చరించుచున్న జనార్దన దేవుల మధురవాణి...

శ్రీ శివాజీ మహారాజు ననుసరించుట... కర్తవ్యము... రఘు మెల్లగా లేచి కన్నులు తుడుచు కొనెను. ఎవరును గన రారు... తిరిగి యదే భీభత్సదృశ్యము... విచారించి లాభము లేదు... దానవ సంహారమునకు జాతీయ సైన్యమునఁ జేరవలసినదే... అదెటులు ?... శిక్ష...

గురుదేవుల ననుసరించ వలసినదే... విజాతీయుల మోసమునకు లోఁబడిన స్వప్రభువును వీడి గురుదేవు లొనర్చినదేమి ? ఆత్మతపము... అదియే దుర్మార్గుల సంహరింపఁ గలదు. ఆత్మశక్తికి మించినదిలేదు. రఘు నిశ్చయమునకు వచ్చెను. మానసిక సంస్కారమునకు వాని కదను లభించినది. అదియే శుభముహూర్తము... చంద్రహాసమును గురుదేవుల పాదములకడ నుంచి నమస్కరించెను... ఏమి సాధించినను ఖడ్గములేక సాధింపవలెను... నాటినుండి రఘు... ముని... మౌనావలంబి... మానసిక తపోదీక్షితుఁడు... మహర్షి... ఎప్పటివఱకు... ఏమో... భావి వివరింపఁగలదు...

రఘు పదము లెటో కదలి పోయినవి...

౭

శ్రీ శివదేవుఁ డీనాఁ డేదియో యొక దీర్ఘాలోచనమున మాతృశ్రీతోఁ బ్రసంగించుచుండెను. శరీరమంతయు ముద్దకట్టినటు లుండుటచే నాతఁడు శీతలబాధను వెల్లడించుచుండెను. మాతృశ్రీ

జిజీబాయి వాని ప్రశ్నలకేమి సమాధానమీయవలయునో యోజించు చుండెను. తులసీవనమంతయు నేడు ప్రశాంతస్థితిని జాటుచున్నది. మారేడుచెట్టుపైగల యొండు రెండు పక్షులజంట లేమియో గుజగుజలుపోవుచుండెను. ప్రాంతపర్వతమునుండి యింకను మంచుపొగ లిటునటు పచారులుచేయుచునే యుండెను. సూర్యదేవుని కిరణములు సంశయముతో వెనుకముందాడుచున్నటు లుండెను. వెల్గులలోం దగిన వికసనము కనుపింపదు.

రఘు బహిష్కరింపంబడినది మొదలు శివాజీ కింతటి చర్చనీయాంశము లభింపలేదు. తానాజీ ప్రభృతులు ముందు కార్యక్రమము స్వీకరించుచుచునే యుండిరి. చంద్రరావు ప్రోత్సాహమునంబట్టం బ్రగ్గము లేక యుండెను.

షాజీవ్రాసిన రెండుమూడు త్తరములు శివాజీని గదలింపలేకపోయెను. వాని యభిమతము వానిది. మొగలాయీలపైం గత్తి కట్టుట ప్రమాదమని యతండు తండ్రియగుట వ్రాయుచునేయుండును. ఈ కక్షలు వ్యక్తిగతమైనవి కావే... ధర్మదేవతను బీడించువారటు మొగలాయీలౌదురుగాక... తదన్యులౌదురుగాక... ఎదుర్కొనవలసినదే గదా...గోహత్యలు పనికిరావని బీజపూరుసుల్తా నంగీకరించెనుగదా... అటు మొగలాయీలేల యంగీకరించరాదు... పరమత సహనముండవలయునని యన్ని ధర్మగ్రంథము లంగీకరించెను గదా... అటు ఔరంగజేబేల దానిం గైసేయరాదు... కావుననే సర్వభూతరక్షణకునై శివాజీ కంకణముకట్టవలసి వచ్చినది...దానికిం దగవేలేదు... మఱి యీనాంటిసమస్య... అంబరరాజా జయసింహుండు రాజకోటకువచ్చి నేంటికి మూండవ దినము. ఔరంగజేబు శివాజీ స్నేహముం గోరుచుండెనంట... శివాజీ యభిలషించు దుర్గములు నాతని కప్పగించుటకే తా నభిలషించియుండెనంట... విషయ

ముల నన్నింటిని ముఖాముఖి సంభాషించుట ధర్మమట... అందులకే జయసింహుఁడు మధ్యవర్తిగా వచ్చెనఁట...శివాజీని వెంబడిపెట్టు కొనిపోయి, ప్రజాసమ్ముఖమున నీ సమస్యను సమాధానించుట తన కర్తవ్యమని జయసింహుఁ డుత్సాహమునఁ జెప్పెనఁట... అకారణ వైరము లరాజకమును నెలకొల్పునఁట...

తానాజీ ప్రభృతులతో నీ విషయము చర్చింపఁగా వారు జాగరూకత నేపనినేని జేయుఁడనినారే కాని గంభీరనిర్ణయమిచ్చినారు గారు. మాతృశ్రీ కిట్టి యుక్తిప్రయుక్తు లందనివి. ఆమెపౌరుషమును రేకెత్తించఁగలదు... ఆత్మవిశ్వాసము నలవరుచఁగలదు... అంతియే కాని శత్రువుల మనస్సు నెఱుఁగఁగలదా?... ఏమయ్యను మొగ లాయీలను విశ్వసించరాదని మాత్రమామె హెచ్చరించినది.

శివాజీ భవానికిఁ బూజల నిర్వర్తించి యాశీస్సుఁ గొనెను. మాతృశ్రీ రక్తతిలకముంచి జయముఁబల్కెను. తనవెంబడి శంభాజీ నొక్కని సహాయముగాఁగొని జయసింహుఁడు వెంటరా శివాజీ ఢిల్లీకిఁ బయనమయ్యెను... తానాజీ ప్రభృతులు నగరముయొక్క పొలిమేరలకంట సాగనంపుచుఁ బరాకుఁబల్కిరి ... ఔరంగజేబేమేని గుటిలమును దలపెట్టెనేని శంభాజీతో వార్తనంపినఁ బ్రతి క్రియకుఁ దామందఱు నుద్యుక్తులముగాఁ గలమని చెప్పుచు సెలవుఁ గైకొనిరి...

రాజకీయము లతిజటిలములనియు, నిముసమున కొక రూప మును ధరించు స్వభావముఁగలవనియు, శివాజీకిఁ దెలియకపోలేదు. తన యాదర్శము పాదుషాకును, పాదుషా యాదర్శము తనకును బోధపడవలెనన్న నిట్టి సమావేశము ముఖ్యమని వాని యభి ప్రాయము. ధర్మదేవతకుఁ బ్రతినిధిగా నటించు తానేప్రదేశమున

ఁ జేఁగిన నపజయము, ప్రమాదములు సంభవింపనేరవను విశ్వాసము తోడనే శత్రువులమధ్యమున కాతఁడిట్లు బయనమయ్యెను...

శివాజీ త్రోవలో నేఁగుచు జయసింహునితో ముచ్చటించుటలోఁ దురుష్కులు దేశము నలువైపులఁ దమ ప్రతిధ్వనులద్వారా యెట్టి దుష్కృత్యములు చేయించుచుండిరో ప్రకటించెను. బట్టకుఁ దిండికి మొగమువాచి, నిలువనీడలేని కాందిశీకు లెంద ఱేయే పాట్ల నందుచుండిరో వివరించెను... ప్రజారక్షణకొఱకు నుద్యోగించునే ప్రభుత్వమేనియు నిట్టి కృత్యములకుఁ గడంగునా యని ప్రశ్నించెను. కేవల రాజ్యకాంక్ష, స్వమత ప్రచారకాంక్ష కల ప్రభుత్వము లెటు లభ్యుదయము నందవో బోధించెను. ప్రజ లారాధించుకొను దేవతావిగ్రహములను, మందిరములను గొల్లఁగొట్టు నీ ప్రభువుల దురాచారములను ఖండించెను. గో బ్రాహ్మణహింస, నిత్యనైతిక సుఖజీవితమునకు గొడ్డలిపెట్టుకాదా యని తర్కించెను.

ఎన్ని యుపన్యసించినను జయసింహుఁడు సరియైన ప్రత్యుత్తర మిచ్చుటలేదు. ఇచ్చినను... కుహనా విషాదమును నంటించుచుండెను. నిజజాతీయ తత్వ మేనాఁడో హరించిపోయిన జయసింహుని గుండెలలో శివాజీ పల్కులు శూన్యమందిరమునఁ బ్రతిధ్వనించుచున్నటులుండెను. శంభాజీ గొంతులోనుండి మాత్ర మప్పుడప్పుడు హుంకృతులు సన్నసన్నగ వెలువడుచున్నవి.

బహుదూర మేఁగవలసిన గుఱ్ఱములు సులువుగఁ బఱువెత్తుచున్నవి. వాని గిట్టలయడుగున నెన్నికొండలో, సెలయేరులో, గడచిపోవుచున్నవి. శిరోపరిభాగముల వృక్షశాఖలు మాత్రము గాలికెదురే తెంచి నటు లాక్రమింపవచ్చుచున్నవి. వీరు ముగ్గురును గడు నుత్సుకత నటులే వేగిరమున నేఁగుచుండిరి.

ఒకనాఁడు... ఢిల్లీ యనతిదూరమున నున్నదనునాఁడు... శివాజీ కళ్యాణదుర్గ సైన్యములు శాంతినికేతనమును ధ్వంస మొనర్చుటను జయసింహునకుఁ జెప్పెను. కొలది యేండ్లనుండియు జనార్దన గురుదేవులాయాశ్రమము నెట్లు వృద్ధినందించుచుండిరో, తనకెట్టి ధైర్యోత్సాహముల నొడఁగూర్చుచుండిరో వర్ణించెను. జయసింహుని మొగమున నెత్తురుచుక్క లేదు. తన యాస్థానము నుండి వైదొలఁగిన జనార్దన విద్వాంసులు శివాజీకిఁ దోడ్పడుటయే కాక తమ యసువులను దేశకళ్యాణమున కర్పించుట... ఎంతటి త్యాగము... ఆ విప్రుఁ డన్నంత పనియుఁ జేసెనే... తానుమాత్ర మీ పాపపు బండ్లను తోలుచుండెనా?... ఎంతనీచము... జయ సింహుఁడు గుఱ్ఱము నాపివైచెను. పెద్దనిట్టూర్పు విడచి క్రిందికి దిగెను. శివాజీ యాశ్చర్యమున నేమని ప్రశ్నించెను.

జనార్దన గురుదేవుల చరిత్ర చెప్పి తన యపరాధమును శివాజీకిఁ దెలియఁజేసి పశ్చాత్తాపమున క్షమార్పణము నిచ్చిన మంచిదని యంతరాత్మ చెప్పెను. కాని యంతరంగమున దుష్టబుద్ధి యా భావమును మఱలించెను. 'పిచ్చిగా క్షమార్పణ నిచ్చి భావికాలమున నౌరంగజేబీయనున్న నున్నత పదవులఁ గాలఁదన్నుకొందువా?' ఒక్కనిముసము చంచలుఁడైన జయసింహుఁడు... "మఱేమియు లేదు. హృదయమునఁ బైత్యప్రకోపమధికముగ నున్నది" యని యశ్వమునెక్కెను.

కుతంత్రమున శివాజీనిఁ బట్టితెమ్మని చెప్పిన యౌరంగజేబు మాటలలోని యాంతర్యమును జయసింహుఁడెఱుఁగఁడా? ఐన... తానిట్టిపనుల కేల యుద్యోగించెను? శ్రీకృష్ణుని బిలుచుకొనిరమ్మని యక్రూరుని శాసించిన కంసునికిని, ఔరంగజేబునకును భేదమున్నదా? నాటి యక్రూరుఁడెట్టి విషమ నాటకమున నెట్టిపాత్రమును నటిం

చెనో... పురాణములను, పూర్వశాస్త్రములను నేర్చిని జయసింహుఁడు నిజముగ నజ్ఞానమునకుఁ బ్రతిబింబము. దురాశకుఁ బ్రతిరూపము. అవినీతి శక్తికిఁ బ్రతినిధానము...

ఢిల్లీలో శివాజీ రాజమార్గమున నిఱువైపులఁ బరిశీలించి చూచెను...

ఆకసమంటు సౌధరాజములు... ఐశ్వర్యములకుఁ గాణాచియగు నిత్యనూతనశోభ... అగరుధూపముల గుమగుమలు... అభ్యుదయ నాగరికుల యాలాపములు... సౌందర్యవతుల సారస విన్యాసములు... అగణితములుగ శివాజీ నాకర్షించినవి. కాని తన నాసాగ్రములకు, తన చక్షురింద్రియములకు, తన హృదయ కోశమునకు నివియన్నియు విరూపములుగఁ గన్పించుచున్నవి... ఏమి యీ పరపదదాస్య దుర్గంధములు... ఏమి యీ విజాతీయుల భిక్షారతులు... ఏమి యీసామ్రాజ్యవాదుల మెఱుఁగుబూతలు...

శివాజీకి నగరౌన్నత్యము కన్నులఁబడుటతోఁ దరతరముల నాటి యార్యచరిత్ర స్మృతివీధికిఁ జనుదెంచెను. స్వల్పప్రభావమున, సంస్కారరహితులైన మొగలాయీల కృషియే ఢిల్లీప్రాభవమునకుఁ గారణమనుటను శివాజీ పదునాఱుజన్మల కొప్పుకొనఁడు. ఈ మసీదులను బండల నెత్తినవాఁడెవఁడో, ఈ భవనముల రత్నములఁబొదిగిన దెవఁడో, ఈ తివాసీలకు రంగులిచ్చినదియెవఁడో, ఈ సంపదల యుత్పత్తికి నిజకారణుఁడెవఁడో... శివాజీ యంతరాత్మ ఢంకాకొట్టి చెప్పఁగలదు. పరదేశములనుండి వలసవచ్చిన తురుష్కులీ యఖండ రత్నభాండముల నెత్తినిమోసి తెచ్చిరనిన నెవ్వరంగీకరింపఁగలరు...

భావనావేశమున శివాజీకి నోడలు తెలియుటలేదు. జయసింహ శంభాజీలు పోవుమార్గములఁ దానును గుఱ్ఱము నదలించుచుండెను. ప్రజలలో నెవ్వరి మొగములలోనికిఁ జూచినను...

క్షణికానందమే కాని నిత్యమైన, స్వచ్ఛమైన యలౌకికానందము లేశమైనను లేదని దర్శనమీయదు. దర్బారును సమీపించుసమయము నకు జయసింహుఁడు పాదుషాల యైశ్వర్య ప్రశంసయేదియో తెచ్చెనుగాని శివాజీ కది విన్పించినట్లు లేదు...

రాచనగరునఁ బ్రవేశించి నాల్గు భవనముల నతిక్రమించి యొక మలుపుతిరుగుటతో... దర్బారుమహాలు ప్రత్యక్షమైనది. పైనుండి చూచిననే యనల్పశిల్ప సౌందర్యసీమల హద్దులుతీర్చి కొనిన భవనరాజమయ్యది యని శివాజీ యాశ్చర్యపడెను. అనతి కాలమున మయూరాసనమున నుపవిష్టుఁడైన పాదుషాను దర్శింప వచ్చునను కల్పనలోనున్న శివాజీని జయసింహుఁ డిదియే మన విశ్రాంతిమందిరము, నేఁడిచ్చట సుఖముగాఁ గడపి యుదయమునఁ బాదుషాను జూడవచ్చునని హెచ్చరించెను. శివాజీభావముల కించుక యంతరాయము కలిగెను. ప్రయాణపు బడలిక నేని గణించక నేఁడు దర్బారున కేఁగవలయునని కుతుకపడిన శివాజీకాదినము శుక్రవార మనియు, దర్బారునకు సెలవనియు, నాఁడు ప్రార్థనాదిన మాటచే నౌరంగజేబు పరులతో భాషించఁడనియు, నివియన్నియు నౌరంగ జేబు సౌశీల్యమునకుఁ దార్కాణములనియు జయసింహుఁడు వర్ణింప మొదలిడెను. జయసింహుని పల్కులు శివాజీకి రుచింపవయ్యెను. అన్నదమ్ములను హతమార్చి, కన్నతండ్రిని కారాగారమున నుంచి సంప్రదాయ విరుద్ధమున సామ్రాజ్యమున కేలికయైన పాదుషాకెంతటి సౌశీల్యముండునో శివాజీ గణింపలేకుండునా? తన కర్తవ్యమార్గ మున కంతరాయమైన కంటకమును ప్రత్యక్షమున నెదుర్కొని త్రొలంగించుట కాతఁడిటవచ్చినది వానిహృదయ మెఱుఁగదా?

ముప్పురును నొక మందిరమున నడుగుంచిరి. రాజసేవకులు నల్గురును వీరికుచిత సౌకర్యములఁ జూపి స్వాగతించిరి. తానుమఱు

నాఁడు దర్శనము చేసికొనఁగలనని వచించుచు జయసింహుఁడు సెలవుఁదీసికొనెను. రాజభటులు తమతమ పనులపైఁబోయిరి. శివాజీ కొంత యూపిరిఁదీసికొను నవకాశము లభించినది. విషమసమస్యల నిరుకటము నొందుచున్న భావనా స్రవంతులకుఁ దగు మైదానము లభించినది. అతఁడు శంభాజీతో మెల్లగా సంభాషణము సాగించెను. భవిష్యత్తున నేమి చేయవలయునో యనుదానికి సమాధానము మాత్రమింకను లభ్యముకాలేదు... సమయానుకూల్యమునుబట్టి యిరువురును సాహసించుటకే నిశ్చయించిరి...

సూర్యదేవుఁడు పశ్చిమదిశకు సీమల నతిక్రమించి వేగుటతో నాకసమంతయు రాగరంజితమయ్యెను. వాతావరణము వింతరంగుగఁ దోఁచుటతో శివాజీ యంతరంగము సంశయరక్తిమ నందెను. వాని మస్తిష్కమున నొండు రెండు సంఘటనములు కల్పింపఁబడి మాయమగుచున్నటులుండెను...

శంభాజీ ప్రయాణశ్రమచే నొక శయ్యపై నొరగియుండెను. శివాజీమాత్రము గవాక్షమార్గమునఁ బ్రకృతిని బరిశీలించుచునే యుండెను. క్రమముగా నాకాశము చీఁకటి ముసుగును ధరించెను. మేలిముసుఁగుపై నక్షత్ర కాంతులు చెమికీరంగులవలె మెఱయు చుండెను.

ఇద్దఱు రాజసేవకు లెవరో భోజనపదార్థములుగల పాత్రలతోఁ జనుదెంచి వానినచ్చట నుంచిరి. ప్రశ్నింపగా... బ్రాహ్మణులమే యనిచెప్పి, నిలువక వెడలిపోయిరి. శివాజీ శంభాజీల కచ్చటి పరిసరములేలకో సంశయభయములఁ గల్పించుటతో వారా పదార్థములను స్పృశింపలేదు. రాత్రియంతయును వారు మేల్కొనియే గడపిరి. పట్టణమంతయు నే సముద్రములోనికో దిగిపోయినటు లనిపించిన కాళరాత్రి యెడనెడ "అల్లాహెూ అక్బర్" అను నినాదములు

మాక్రోశములుగ వినిపించుచు వచ్చెను. ఆ భగవత్స్మరణములో పావందతన్మయత్వముగాని, సుస్వరఘటితిగాని కన్పించక వెట్టికేకలుగా భ్రమింపఁజేసెను. అచ్చటకుఁ జేరుటతోడనే సుఖముగ నెయ్యవియో రాజకీయ సభావేశములు సంఘటితము లగునని యాశించిన శివాజీకి శూన్యప్రకృతి దర్శనమిచ్చెను. భారతస్వాతంత్ర్యమునకై తాను జేయుచున్న మహాప్రయత్నములను దెలిసిన జీవి యొక్కటేనియు నా ప్రాంతముల లేనట్లును, సహాయసానుభూతులఁ జూపించువాఁడొకఁడేనియుఁ దారసిల్లుట యసంభవమనియు శివాజీకిఁ దోఁచెను. ఒక్కశుభనిమిత్తమేనియుఁ గన్పింపని వాతావరణమునఁ దా నధికమేమి యాశింపఁగలఁడు...

కోడి కూసినది. విపరీతధ్వనులేవియో మ్రోఁగినవి. తారలు జారినవి. జీవులు సంచలించినవి... అరుణోదయమైనది. కాలకృత్యములకు వేగిరమందుచున్న శివాజీ శంభాజీలకుఁ గఱకుతురుష్కులు సాయుధులై ముగ్గురు కన్పించిరి. అందు ముఖ్యుఁడు "మీరు మా బందీలు... ఇంక... కదలిపోలేరు. కాలక్రమమున విచారింపఁబడుదురు. ఇయ్యది యౌరంగజేబు నాజ్ఞ"యని కల పత్రమును శివాజీకి నందించెను... శివాజీ నేత్రము లగ్నిగోళములైనవి... శంభాజీ నిలువునఁ గూలిపోయెను. క్షణములో నా భవనము చెఱసాలగా రూపమందెను.

## ౬

"తానొకటి తలచిన దైవమొకటి తలచుననునది మానవులందఱకు నన్వయించుసూక్తి. దైవమును లెక్కింపనివాఁడును తారుమారు నందినస్థితిలోఁ దలక్రిందులైన ఘట్టములో నీ సూక్తి స్మృతికిఁ దెచ్చుకొనితీరును. తలఁచిన తలఁపులెల్ల కార్యసిద్ధినందిన మానవుఁడు విఱ్ఱవీగి వేసటమైపోవును. ప్రతిజీవాణువున నంతరితమై యుజ్జీవమిచ్చు

శక్తి తత్వమును మఱచి సృష్టికిఁగారణము మనసే... అభ్యుదయము నకు నాధారము మనసే... నాశనమునకు ఘటికులము మనసే యను సిద్ధాంతము నలవఱచుకొనిన ప్రాణులెట్టి రూపమునందునో యనుభవజ్ఞులు పోల్చఁగలరు. దుర్మార్గుఁడు తా నొనర్చు కృషిలోఁ దాత్కాలిక ఫలము నందినను, జయమును బొందినట్లు భ్రమింప వచ్చునుగాని భవిష్యత్తున దానినొక విద్యుత్తు విసవిస లాడింపక పోదు. అందుచే నన్నియు భగవల్లీలలని నిరాడంబర భావము నందినవాఁడు దైవసాన్నిధ్యము నందఁగలఁడు. కష్ట సుఖముల సమానముగఁజూచినవాఁడే సిద్ధుఁడగును".

పై విధముగ నేవియో వేదాంతముల నపలపించుచున్న యోగినిజూచి సరయూబాల యొకింత యూఱట నందినది. మార్గ వశమునఁ జనుదెంచి భిక్షనారగించుచున్న నీ సాధువు నాతివయఃకాఁ డుఁడు. గడ్డము మాత్రము ప్రౌఢిమనుజాటుచున్నది. కన్నులెదియో పరిచయమును వెల్లడించుచున్నవి... మధుసూదన పండితుఁడు భోజనమును ముగించుకొని శిష్యుల యొద్దకుఁ గాలక్షేపమున కేఁగుటతో సరయూబాలకి యోగితో మాట్లాడుటకుఁ దగిన సావకాశము లభించినది. యోగి యుపన్యాసమును వేఱుత్రోవ పట్టించు కుతూహలమున నామె "అయ్యా! మీరు శాంతి నికేతనము పేరు వినియున్నారా?" యని దీనముగఁ బ్రశ్నించెను... "ఓహో! ఏమి ప్రశ్నవైచిరి.! శాంతినికేతనముపేరు వినియుండు టయా? జనార్దనగురుదేవుల సాక్షాత్కారమునుగూడ పదేపది యుందిన నే నదృష్టశాలిని... శాంతినికేతనము సర్వనాశనమందిన విషాద చరిత్రయు నా కవగతమే. ఏమిచేయవలె?... గురుదేవుల నిర్యాణము భారతమునకుఁ దెలియని విపరీతనష్టము... అంతయు భగవల్లీల..." అని యోగి యామె కన్నులవైపు చూచెను. ఆమె

యశ్రుతోయములఁ దొప్పఁదోగుచు విచారమున "నాకుఁ బోషకులు, జనకతుల్యులు, ...." అని యర్ధోక్తిలో గద్గదికము నంది యాగినది...

"ఔను వారు భగవంతుని సన్నిధికేఁగిరి. అబలా! అటుల విచారింతువేమి? అట్లు విచారించి ప్రయోజనములేదు. గురుదేవుల యాదర్శ మెన్నఁడును వృథాకానేరదు. తత్సిద్ధికై మావంటి బాల యోగులు వేనవేలు కృషిచేయుచున్నారు... అట్టికృషి యిట్టిదని ప్రకటింపరాదు. అంతయు భగవల్లీల..." సరయూ కేలనో యానందము జనించి కన్నులు తుడుచుకొనెను... యోగి మౌనము నూనెను...

అంతలో... మధుసూదన పండితుఁడు రోయుచుఁ బరువెత్తి వచ్చి "అమ్మా! సరయూ! వింటివా? శివాజీ శంభాజీలు ఢిల్లీలో బందీలైరట... ఔరంగజేబు వారిని బంధించెనట..." అని యాయాసమునఁ బల్కెను. సరయూ కెవ్వన నయ్యో యని కేక వైచెను. యోగి కన్నులు మూసి వేదనను బలవంతమున నాపుకొనెను.

రాజకోటలోఁ దానాజీ ప్రభృతు లేమిచేయుటయా యని విభ్రమ పడుచుండిరట. మాతృశ్రీ భవానీ పాదముల చెంగట రోదించుచున్నదఁట... ఇది యదనుగఁ జూచి సమీప దుర్గముల తురుష్కులు దండెత్తి రాఁగలరేమో యని తానాజీ రాజకోట నతి జాగ్రత్తగ రక్షించుట కేర్పాటులఁ జేసెనఁట... అంతయు విపరీత ముగ నున్నదని మధుసూదన పండితుఁడు దిగాలుపడి ప్రక్కపైఁ గూలిపోయెను... భారతీయులకున్న యాధారముకూడఁ దొలఁగి పోవును గాఁబోలు... ఇంక భరతమాతకు స్వాతంత్ర్యము తొలఁగవు. కాందిశీకులు దిక్కులేక చనిపోవలసినదే... ఏమేమియో యస్పష్ట

ముగ సరయూబాల గొణుగుచుండెను. ఆమెలోఁ బ్రాణము లేనట్లుండెను.

ఆకస్మికముగ నేదిజ్ఞప్తికివచ్చెనో యోగి తటాలున లేచి మధు సూదనునికి నమస్కరించి సెలవుఁ గైకొనెను. సరయూబాలతో "అంతయు భగవానుని యనుగ్రహము. సర్వముఁ జక్కబడఁగలదు" అని మాత్రము పల్కి యోగి వనసీమలవైపునకు నదృశ్యుం డయ్యెను...

శివాజీ బందీ యగుటను గుఱించి శివనాథమునందే గాక పరిసరముల పల్లెలయందును విషాదముగఁ జెప్పుకొనుచుండిరి. ఎవరినిఁ జూచినఁ గంట నీరు పెట్టువారే... ఎవరినిఁ బలుకరించిన నభాగ్యమనువారే. దినచర్యలను మఱచి రైతులందఱు వెఱ్ఱులవలె దిరుగుచుండిరి.

ఇఁక... అచ్చట రాజకోటలో... అంతయు విషాద దృశ్యమే... దేవాలయముల ఘంటానాదములేదు. వర్తకులు దుకాణములు మూసివైచిరి. సైనికులందఱు నాయుధములతో గడ బిడఁగఁ దిరుగుచుండిరి. శిశువులు పాలుత్రాగుటయు మానివైచిరని యొక ముసలి ముత్తైదువ పొరుగువారికి వినిపించుచున్నది. గోవు లన్నియుఁ గన్నీరుఁగార్చుచు నటులనే చిత్తరువులవలె నుండిపోయి నవి. పౌరులందఱు నిశ్చేష్టులై యాకసమునకుఁ జూచుచుండిరి... మాతృశ్రీ భవానీసన్నిధి నిలువఁబడి తానాజీ ప్రభృతులకు హెచ్చ రికల నిచ్చుచు నోదార్పు కల్గించుచున్నది. హృదయమున విషాద సముద్రములే పొంగుచున్నను నా యమ సైన్యాధినేతలకు ధైర్య మిచ్చుచు రాజకోట సంరక్షణమున నూత్నయత్నములఁ జేయుచు చున్నది.

తానాజీ యిప్పుడే యశ్వముపై దుర్గమంతయుఁ జుట్టివచ్చి సైనికులను సమాయత్తపఱచియుండెను. వాయువేగమున నాతఁడు ముఖ్య సింహద్వారమువైపునకుఁ బర్వెత్తుటతో నొక దృశ్యము కన్నులఁబడెను. చంద్రరావు యొక్క ముఖ్యసేవకుఁడు రామోజీ ద్వారరక్షకుని నేదియో బ్రతిమాలుచుండెను. తానాజీ యాజ్ఞలేనిదే లోని ప్రాణి యొకటేనియు బైటకుఁ బోవీలులేదని కావలివాఁడు చెప్పుచుండెను... అంతలోఁ దానాజీ యచ్చటికే చనుదెంచెను. తానాజీని జూచుటతో రామోజీ పైప్రాణములు పైకిఁబోయినవి...

ఏమది? యని తానాజీ ప్రశ్నించుటతోఁ దన చెల్లెలికిఁ బ్రాణముమీఁదికి వచ్చినదనియు నామె సమీపమునఁగల పల్లెలో నుండెననియు నచ్చటి కేఁగివచ్చుటకు మార్గము కోరుచుంటిననియు రామోజీ యేడ్చుచుఁ బలికెను. వాని యేడ్పునకు నితరులగుచో నిజముగఁ గఱగిపోయెడివారే. కాని... తానాజీ సూక్ష్మబుద్ధి క్షణకాలమున నెదుటివాని ముఖకళవళికలను బోల్పఁగలదు... చెల్లెలి ప్రమాదమున కీతఁడు కావలివాని బ్రతిమాలి యేమి ప్రయోజనము? తనకుఁజెప్పవచ్చునే? తన యజమాని చంద్రరావుచేఁ జెప్పింపవచ్చునే! రామోజీ కంటినీటిలో విశ్వసింపఁదగు సానుభూతికాంతు లవియుఁ దానాజీకి దృగ్గోచరము కాలేదు. అశ్రుకణములు పరిమితి కెక్కువయే యున్నవి; కాని... హృదయబాధ యందు నిబిడీకృతము కాలేదు. నటకుని యేడ్పునకును రామోజీ యేడ్పునకును జాలఁ బోలిక గలదని తానాజీకిఁ దోఁచెను. అందుచే నతఁడు కొంచెము యోజించెను. రామోజీ యెట్టివాఁడో కాని, చంద్రరావు మాత్రము రెచ్చితినినపులి యని తానాజీకిఁ దెలియకపోలేదు. అనుమాన మెదిరిపా యావేశింప నతఁడు కావలివానితో "పాపము! చెల్లెలు ప్రమాదమున నుండెనఁట! వానిదుస్తుల నన్నింటిని బరిశోధించి

చున్నాడము. మన సంశయము తొలఁగిన విడువవచ్చును" అనెను. ఇట్టి యూహా తానాజీ కెందులకుఁ గలైనో. యాశ్చర్యము. భవానీ యనుగ్రహము. రాజకోటవిచ్ఛిత్తికి దైవము సంకల్పింపలేదు.

రెండు నిముసములలోఁ గావలివాఁడు రామోజీని బరిశోధించెను. పై..పాగనుండి యొక యుత్తరము పావురముతోతె నేలవ్రాలినది... రామోజీ నిజముగఁ జచ్చినటులాయెను. తానాజీ యా యుత్తరమును జదివెను.

"అహామదున కాశీస్సులు... మన యదృష్టము పండినది. శివాజీ ఢిల్లీలో ఖైదీయైనాఁడు. అన్నియును సమాయత్తపరచితిని. రేపురాత్రి రెండవయామమున రాజకోట మనవశము కావలెను. తగిన దండుతో రండు. దేవుఁ డనుకూలించును. తానాజీ వర్గము మనల నేమియుఁ జేయఁజాలదు."

ఉత్తరమునకుఁ గ్రింద సంతకములేదు. నెలవంక గుర్తుకలదు. వెంటనే దానికర్థము చంద్రరావని తానాజీకి స్ఫురించెను. రామోజీని వెంటనే దుర్గద్వారమునఁ దలక్రిందుగా వ్రేలఁదీయించి సత్వరముగఁ దానాజీ చంద్రరావింటి వైపునకేఁగెను...

విచిత్రభావ భవనముల నాకాశవీథినిఁ గట్టుచున్న చంద్రరావునకుఁ దానాజీ రక్షకభట సహితుఁడై దర్శనమిచ్చెను. క్షణకాలమున నా రాజవీథి నొకవింతదృశ్యము సృజింపఁబడినది. చేతులు వెనుకకు విఱిచి కట్టఁబడి గళసీమల శృంఖలముల ధరించి నమ్రవదనమునఁ దానాజీ ననుసరించి దుర్గాభవనమునకుఁ గొనిపోఁబడు చున్న చంద్రరావు పౌరులందఱకు వినోదమిచ్చెను. భారతీయ విద్రోహి యని వాని చరిత్రము ప్రజలందఱును దెలిసికొనిరి. పై నుమిసినవారు కొందఱు, కాలఁదాచినవారు కొందఱు, జుట్టుపీకినవారు కొందఱు, మీసములఁ..బెఱికినవారు కొందఱు; తానాజీ

ప్రజల నేమియు ననలేదు. జాతిద్రోహి కిది కావలసినదని మనమున భావించెను. ఐననేమి... చంద్రరావున కభిమానమా? అవమానమా? వానిలోని జీవాణువు లేనాఁడో నశించినవి...

దుర్గసన్నిధి... మాతృశ్రీ పాదములకడఁ జంద్రరా వప్పగింపఁబడెను. వీని విషయములు దెలిసిన జిజీబాయి "వీని మొగము చూచిన మహాపాపము రాఁగలదు. ఐనను... వీని నట మంటపము నందుగల స్తంభమునకు విఱిచి కట్టుఁడు. భవానీయాజ్ఞ యగువఱకు నాహార పానీయముల నీయకుఁడు" అని యాజ్ఞాపించెను. చంద్రరావును గావలిఁగాయఁ బ్రత్యేక సైనికులు నియమింపఁబడిరి. మాతృశ్రీ మఱల దుర్గాపూజలో నిమగ్నురాలయ్యెను...

నాఁడు దుర్గాక్రమణమునకు నడ్డైనది చంద్రరావే యైయుండు ననియు రఘువంటి వీరయువకుఁ డన్యాయముగా శిక్షింపఁబడెననియు రాజకోటయంతయు గుప్పుమనెను. తానాజీ నాఁడే శంకించియుండెను. కాని... రుజువులేనిదే యేమనుట...

చంద్రరావు బంధింపఁబడుట కనుఁగొనిన లక్ష్మి దుఃఖమున కంతములేదు. రఘుచేతిలో వీనికిఁ బ్రమాదమున్నదని యామె శంకించెనుగాని తన భర్త దేశద్రోహియై శివాజీ చేతిలోఁబడునని యూహింపలేదు. ఇప్పుడు తనకై దవతనముపైఁగల సందేహముకంటె భావియుగమునఁ జరిత్రకారుఁ డీ దంపతుల నెట్టి నికృష్టులనుగఁ జిత్రించునో, ఆధ్యాత్మిక దేశమున కాపద నాపాదింప యత్నించినందులకు భగవానుఁ డెట్టి నరకములఁ గల్పించునో యను పీడయే యధిక మయ్యెను. ఆమె తన భర్తచే క్షమార్పణమిప్పించి జిజీబాయికడఁ బతిభిక్ష నర్థింపఁ గుతూహలపడుచుండెను. గాని... శివాజీ వర్తమాన

మునఁ బ్రమాదమున నుండెనను వార్త యామెకు నిరాశ కల్గిం చెను... ఇట్టిసమయమున మాతృశ్రీ మతిస్థైర్య మెట్లుండునో...

మాతృశ్రీ మఱలఁ దానాజీని బిల్వనంపి రహస్యమున సంభాషించినది. ఏ యుపాయమున శివాజీని విడిపింపవలయునో వారికిఁ దోచలేదు. ఎవరు ఢిల్లీకి వెడల నుద్యమించుట ? తానాజీ రాజకోటను వీడినఁ దురుష్కులెట్టి ప్రమాదము నీ దుర్గమునకుఁ దెత్తురో ! కడకు సూర్యాజీనంపి ఢిల్లీపరిస్థితుల నఱయ నిశ్చయిం చిరి. సాధ్యమైన నతికాలమున నతఁడే శివాజీని విడిపించునని వారందఱును ధైర్యము వహించిరి. సూర్యాజీ రహస్యముగ ఢిల్లీకిఁ బయనమైపోయెను. మాతృశ్రీ దుర్గపూజలోను, తానాజీ దుర్గ రక్షణలోను లీనమగుటతో వాతావరణమంతయుఁ బ్రశాంతినందినది.

శివాజీ శంభాజీలు ఢిల్లీలో బంధింపఁబడి నేటి కెనిమిదవ దినము. ఉదయముననే వత్తునని వెడలిన జయసింహుఁ డింతదనుక రానేలేదు. ఔరంగజేబు ధీరత్వమేమియో... కావలివారి సంఖ్యను బెంచుచుండెనేకాని వీరిని బ్రత్యక్షముగఁ జూచి సంభాషింపఁ గుతూ హలమునందు లేఁడు. ఏ గడియకెట్టి ప్రమాదము సంభవించునో యని శంకించిన శివాజీ శంభాజీ లర్థములేనిస్థితి నందుచుండిరి... వీరలను సంహరించుటకే యిచ్చటికి రప్పించిన ఔరంగజేబాపని నేల చేయింప రాదు. అట్టి కృత్యమునకుఁగూడ వానికేదియో పిరికితనముండి యుండునా ? వాని యాదర్శమేమియో బోధపడుటలేదు. నాల్గుదిన ముల క్రితమే శివాజీ శంభాజీలు తమకు ననారోగ్యముగా నున దనియు, వెన్వెంటనే దర్శనమిచ్చి తమ నివాసస్థానమునకేఁగ సెల విప్పించుమని యౌరంగజేబునకుఁ గబురంపిరి. ఆరోగ్యము చేకూఱిన పిమ్మట వెడలవచ్చునని పాదుషా యా సేవకునిచేతనే ప్రత్యుత్తరము నంపెను. దర్శనముమాట లేనేలేదు...

ఆహారహారము ద్వారము ముందునను, రాజవీధిలోను సంచరింపు మొగలాయీ శిరములఁజూడ నసహ్యముపుట్టి .. శివాజీ శంభాజీలు ముసుగువెట్టి నిద్రను నటించుచుండిరి. ఎన్నిదినములు వారీ బంధనమం దుండవలయునో తెలియుటలేదు. రాజకోటలో బయలుదేరినప్పుడే యొక నిశ్చయమును వారెంచుకొనలేక పోయిరి. జయసింహుఁ డొక గోముఖ వ్యాఘ్రమని వారూహింపరైరి... ఎన్ని మహత్తర కార్యములనో సాధింప దీక్షవహించిన శివదేవుఁడు పౌరుష శూన్యునివోలె నిట చిక్కుకొనెను. నీవా నేనా యని పాదుషా యెదుర్కొని సంభాషించునని యూహించెనుగాని పాదుషా ఇట్టి నీచమున కొడంబడునని యెంచనేలేదు. సహజన్ముల యెడ, జనకునియెడ, ద్రోహ మొనరించిన పాదుషా తదితర రాజ కార్యములయందును నీచ మొనరించిన నతఁడిక ప్రభుత్వమున కేమి సారథ్యము వహింపఁగలఁడు. జయసింహుఁ డిప్పుడు కేవల మొక యమ్ముడువోయిన పశువని తెలిసినది. అమ్ముడువోయిన పశువేని తన స్వజాతికి విరుద్ధమైన పనులఁ జేయ నిచ్చగించునే?...

శివాజీ ముసుగులోనుండి వెలుపలికిఁజూచెను. ఒక బైరాగి యెవఁడో యచ్చటి సైనికులకు జ్యోతిషము చెప్పుచుండెను. ఎవఁడాసన్యాసి. జాతీయుఁడా? విజాతీయుఁడా? అరబ్బీభాష నద్భుతముగా మాట్లాడుచున్నాఁడే? శివాజీ లేచి కూర్చుండెను. సైనికులకుఁగల జ్యోతిషపుపిచ్చకు నాతఁడు తనలోనే నవ్వుకొనెను. మధుసూదన పండితుని యింటికడ వేదాంతము మాట్లాడిన వాఁడితఁడే యని చదువరులకు వేఱ జెప్పనక్కఱలేదు.

అతఁడు వారికేమి చెప్పుచుండెనో... సైనికులు పొట్టలు చెక్కలగునట్లు నవ్వుచుండిరి. వింతవింత హావభావములఁ జూపుచుండిరి. ఒకరిపై నొకరు పడుచుండిరి. శివాజీ కైదియంతయు

వినోదముగనే యుండెను. మధ్యమధ్య నా బైరాగి శివాజీవైపునకు జూచుచు నేదియో చెప్పుచుండుటచే శివాజీకి మఱియుఁ గుతూహల మధికమయ్యెను. శంభాజీ ముసుగులో నిజముగనే గుఱ్ఱుకొట్టి నిద్రించుచుండెను. అంతనాకస్మికముగ నా బైరాగి సైనికుల సంజ్ఞాసహాయమున శివాజీకడ కేతెంచి పర్షియన్‌భాషలో నేదియో ప్రశ్నించెను. శివాజీ తనకాభాషరాదన్నట్లు సంజ్ఞచేసెను. సైనికులు దూరమునుండియే పకాలున నవ్విరి.

ఆ యోగి సన్నగా శివాజీవైపు వింతదృష్టినిఁ బ్రసరింపుచు మహారాష్ట్రములో జబ్బుగానున్నట్లు నటించుచుండుమనియుఁ దాను పాదుషాకుఁ జెప్పి కొన్ని ప్రక్రియలు చేయించి బందీనుండి విడిపింతుననియు, తనను విశ్వసింపవలయుననియుఁ జెప్పెను. శివాజీ యాశ్చర్యమున "నీ వెవర"నెను. సమయము వచ్చునపు డన్నియుఁ దెలియునని బైరాగి మఱల పర్షియన్‌భాష మాటలాడ మొదలిడెను. ఇరువురు సైనికులు దగ్గఱగా వచ్చుటఁజూచి యా బైరాగి యా యిద్దరికిని సైతాను సోకెననియు, నా దయ్యమును గదిలింపనిదే శరీరతాపము పోవదనియు, వివరించెను... బైరాగిమాటలకు శివాజీ యాశ్చర్యపడి వానికనుసంజ్ఞచేఁ జూచుచుండఁగనే శయ్యపైవ్రాలి యాయాసమును నటించెను. బైరాగి శివాజీ యొడలిపైఁ జేయివైచి యిట్టిది మహాజ్వరమనియుఁ బాదుషాకుఁ జెప్పి చికిత్సఁ జేయింపుఁ డనియు సైనికులఁ బ్రోత్సహించెను. వీరు బందీలోఁ బ్రమాదమునొందిన మొగలాయీ సామ్రాజ్యమునకే విచ్ఛిత్తి కల్గుననియు హెచ్చరించెను. సైనికులలో నొకఁడు వెన్వెంటనే పాదుషాకడకుఁ బర్వెత్తెను.

బైరాగి శివాజీకి రక్తేక్షణములతో నేదియో వివరించుచు సైనికులకడకు మంత్రముల నుచ్చరించుచు నేఁగెను.

ఎవరీ వేషగాఁడు ? ఇదియే శివాజీ జిజ్ఞాస......

## ౧౦

ఎదుటిజీవుల కపకృతిఁ దలపెట్టువాఁడు బొత్తిగ నాలోచనాశూన్యుఁడని యెంచరాదు. వానికి నితర జీవకోటికివలెనే భావములు మొలకెత్తి యంతరించుచుండును. వాని హృదయమునఁగూడ భావసంఘర్షణ మనవరతమును సాగుచునే యుండును. వానిలోని దురాశ సద్భావముల నణచివైచి దురాలోచనములకే ప్రాముఖ్యమిచ్చి వానిచరిత్రను గల్మషభూయిష్ఠము చేయుదాక విడువదు. అట్టి వానిదృష్టికి చీకటి వెలుగువలెఁ గన్పించును. సాహసించుశక్తి వానిలో నపరిమితముగ నుండినను వెన్వెనుకనే భీతియుఁ గంగారు పెట్టుచుండును. దుర్మార్గుఁడు పరప్రాణి నఱచేత రాచివైచి హింసాకాండమును సృజింపఁగల్గునుగాని తోడ్తోడనే యితరు లరయరాని నరక యాతనను గుండెలలోఁ గల్గించుకొనుచుండును...

ప్రేమరసైకమూర్తియు శిల్పకళాకోవిదుఁడునగు షాజహాన్ చక్రవర్తివంటి మధురహృదయుని జనకుఁడనియుఁ జింతింపక హింసించిన కఠినుఁ డౌరంగజేబు బందీగాలభించిన శివాజీని హింసించిన నెట్టి ప్రమాదములు చుట్టుముట్టుకొనునో యను భీతిని దీర్ఘాలోచనము చేయుచుండెను. జయసింహు నీ విషయమునఁ జక్కగ నుపయోగించుకొనెనుగాని- తరువాతి కర్తవ్యమేమియో బోధపడుటలేదు. శివాజీవంటి విప్లవమూర్తిని దర్బారునకుఁ బిలుచు సాహసము గన్పడుటలేదు. పిలువక గత్యంతరమును లేదు- ఒంటరిగనేనియుఁ దలపడిన శివాజీని బంధింప నసాధ్యమని వీరుల నేకులు దనకుఁ జెప్పియుండిరి. ఏమయ్యును శివాజీ ఢిల్లీలో నుండఁగనే మహారాష్ట్రుల సమస్య ముగింపునకు రావలెను. అందులకై శివాజీతో సంప్రదింప నుత్తమ రాజకీయ యుక్తుల నాతఁ డన్వేషించుచుండెను. తన దర్బారున నీసమస్య సంధిరూపమునఁ జక్కబడవలయునని

ఔరంగజేబు శతథా యత్నించుచుండెను. అందులోఁ దలవని తలంపుగా శివాజీకి ననారోగ్యము కల్గెననియు, శరీర తాపమునకు శాంతిఁ జేయింపవలయుననియు వార్తలు వచ్చెను. ఇట్టిశాంతు లే ధర్మము ననుసరించి జరుగవలయును? వానిని జేయఁగల్గు మాంత్రికుఁ డెవ్వఁడని ఔరంగజేబు మథనపడుచుండ దర్బారులో నొక బైరాగి ప్రవేశించి తాను మాంత్రికుఁడననియు నిప్పుడే మక్కా మదీనాల సేవించుకొని వచ్చుచుంటిననియు, నెట్టి దయ్యమునేని వదిలించఁగలననియుఁ బర్షియన్ భాషలో వచించెను. తోడనున్న సైనికు లిరువురు వాని శక్తిని సమర్థించిరి. ఆ బైరాగి మనకుఁ బూర్వపరిచితుఁ డేయని పాఠకులు పోల్చియుందురు.

శరీరతాప శాంతికై చేయఁదగు క్రియలేవి? యని ఔరంగజేబు బైరాగిని బ్రశ్నించెను. ఆతాపముకల్గిన మానవునిబట్టి యా క్రియలుండునని యతఁడు వచించెను. అగుచో నొకనిజూపింతము. చూచివచ్చి వివరింపుమనుచు ఔరంగజేబు, శివాజీని జూపుమని యొకసైనికుని వెంబడిఁ బంపెను. కొలదికాలములోఁ దిరిగివచ్చిన సాధు పాదుషాతో "అయ్యా! ఆరోగి జ్వరము శమింపవలయునన్న నాల్గు దినములు జపమొనర్చి యైదవ దినమునఁ బకీరులకు మిఠాయీలు పంచి శాంతిఁజేయవలయునని చెప్పెను. వైద్యమువలన మందుల వలన నేమియుఁ బ్రయోజనముండదని దృఢముగాఁజెప్పెను. ఏదియో రీతిగ నీ గండము బాపుకొన నా బైరాగినే శాంతిక్రియల సల్పుమని పాదుషా నియమించెను. బైరాగికి వలయు సాధనముల సమకూర్పఁదగు సేవకుల నాజ్ఞాపించెను...

దర్బారులో నీ సంభాషణమును విని పలువురు పలువిధములుగ వ్యాఖ్యానించిరి. ఔరంగజేబు భూతదయగలవాఁడని కొందఱును, శివాజీ కిట్టిశాంతులను జేయించినటులే చేయించి స్వర్గలోక

మిప్పించుననని కొందఱును గుజగుజలు వోయిరి... అంతర్యమేమిరయో... ఎవరెఱుంగుదురు?...

బైరాగి, శివాజీ సమీపమునకుఁ జనుచుండఁగనే త్రోవలో నొక సాధువేషమున సూర్యాజీ చనుచుండుటఁ గనిపెట్టెను. వేషముల వైచుటలోను, ఇతరవేషముల గుర్తించుటలోను బైరాగికేమి సిద్ధ ప్రతిజ్ఞ కలదో యాశ్చర్యము... సూర్యాజీని మహారాష్ట్రభాషలో "నన్ననుసరింపుము" అని చెప్పుచు శిష్యునిఁబలె వెంటఁదీసికొని పోయెను...సూర్యాజీకిఁ దొలిలో నేమియు బోధపడలేదు. కాని... శివాజీ శంభాజీలను దర్శించినవెనుక... అంతయు బోధపడెను. ఈ బైరాగి యెవఁడో యఖండుఁడనియుఁ దనకంటె ముందుగనే శివాజీని విడిపింపఁ గృషి సల్పుచుండెననియుఁ దెలిసికొని యాశ్చర్యపడెను... సైనికులు దూరమగుటతో సూర్యాజీ తనను శివాజీ కెఱుక పఱచుకొనెను. శివాజీకిప్పు డెనలేని యుత్సాహము కల్గెను.

మోసముఁజేయు శత్రువులను మోసముననే జయింపవలయు నను నది యుత్తమ నీతిశాస్త్రము లంగీకరించిన విషయమే. అసత్యవాదిముందు సత్యవ్రతుఁడు తాను నష్టపడుటయేగాక... పరులకును బ్రాణములకుఁ దెచ్చినవాఁ డగుచున్నాఁడు. కపటునిఁ గపటముతోనే మట్టుఁబెట్టి ప్రజకు మేలుచేయుట ధర్మమే యని శ్రీకృష్ణుని జీవితము పలుమాఱులు ప్రబోధించియుండెను. కేవల సత్యవ్రతమనుపేరనే యార్యచక్రవర్తులు కొందఱు భారతప్రజలకుఁ గడగండ్లఁ దెచ్చిరి. రాతికి సమాధానము రాతితోడను, పూలకు సమాధానము పూలతోడను నీయవలయు నను నది లౌకిక సూత్రము.

సూర్యాజీ యవకాశము లభించునపుడెల్ల బైరాగి నామమును దెలియఁ గోరెను. అంతయు భగవల్లీల యనుటకు వినా సాత్రఁ డేమియు వచించి యుండలేదు. అతఁడు పటాటోపముగ

నవియో మంత్రములు చదువుచుండెను. హోమములు చేయు చుండెను. తాయెత్తులఁ గట్టుచుండెను. నిమ్మకాయలఁ గోయు చుండెను. శివాజీకి నెన్నుదుట విభూతి నుంచి చేతులూగించుచు నుచ్చాటనము సల్పుచుండెను. పరిసరముల సైనికుల దూరముపోవ హుంకరించుచుండెను...

నాల్గు దినములు గడచినవి. శివాజీకి సుఖనిద్ర పట్టుచున్న దనియు శరీరతాపము చల్లఁబడినదనియుఁ బాదుషాకు వార్తలు వెడలినవి. కుతూహలమున కేని జయసింహుఁ డటు వచ్చుటలేదు. శివాజీకి సుఖనిద్రయనునది దేవుఁడెఱుఁగును గాని, వానికిమాత్రము పీడకలలతో నిద్రవచ్చుట లేదు. గుండెలలోన శాంతిసముద్రము లేవియో పొంగులు వారుచున్నవి. భావికాలమున నే కష్టపర్వత ములో విఱిగి నెత్తిని పడునన్న సంశయమేదియో వానిని వికలుని జేయుచున్నది.

ఐదవదినము... మిఠాయి గంపలకొలది యపరిమితముగ గల్లిలవెంబడి పంచిపెట్టఁ బడవలయునని బైరాగి యాజ్ఞ. ఔరంగ జేబు వ్యయమునకు లెక్కింపక యన్నియు సమకూర్పుఁడని సేవకుల ననుశాసించెను. ఆ దినము సుఖముగాఁ గడచిన మఱునాఁడే శివాజీనిఁ దన దర్బారునకు సగౌరవముగాఁ గొనిరావలయుననియుఁ బాదుషా మనసులో నిశ్చయించుకొనెను.

సైనికులసాహాయ్యమునఁ బదునాఱుగంపలమిఠాయి మాత్రము మంత్రవేదికకడకు శివాజీయున్న చోటునకు ముందు పంపవలయు ననియు వానినైవేద్యమైనతరువరి మిఠాయి యంతయుఁ బకీరులకుఁ బంచవచ్చునియు రెండుగంపల మిఠాయి మాత్రము ఢిల్లీకోటకు వెలుపలి రాజమార్గపుఁ గొసనుగల గ్రామదేవతకుఁ గాన్కసీయ వలయుననియు, నా రెండుగంపలను దానును శిష్యుఁడును బట్టుకొని

వెళ్ళవలయుననియు బైరాగి కార్యక్రమమును బిగించెను... దానితో...

పరిసర ప్రదేశములఁగల ఫకీరు లెల్లరు నా దిన ముదయము కాకుండఁగనే దర్బారు సమీపములఁ జుట్టివైచిరి. అందఱును మిఠాయిలఁ దిను నాసక్తిలో నూటలూరుచుండిరి. రంగురంగుల టోపీలవారును, వింతవింత చినుగుల దుస్తులవారును, చక్కచక్కని గడ్డములవారును, సీమకొబ్బరిచిప్పలను జేతఁబట్టి వీధుల బారులై యుండు నా ఫకీరులను గాంచిన వింతదృశ్య మన్పింపకపోదు. సౌధోపరిభాగములనుండి (శ్రీ)మంతు లీ విచిత్రములను జూచుచుండిరి. వందలాది మిఠాయిగంపలు మాంత్రికుని సమీపించినవి. పదునాఱు గంపలను వెంటనిడుకొని బైరాగి శివాజీ శయ్యను సమీపించెను. శివాజీ శంభాజీ లిద్దరును శయ్యలపై నింకను నిండు ముసుగులో నిద్ర నటించుచుండిరి. పదునాఱు మిఠాయిగంపలను గ్రింద దించుఁ డని సేవకుల నాజ్ఞాపించిన యోగి "ఫట్. ఫట్" మను భీకర మంత్రముల వేనినో చదివి గట్టిగా గర్జించెను. సేవకు లీ యుచ్చాటన మును విని గడగడలాడిపోయిరి. బైరాగి వారిని జూచి "ఓయీ! ఈ రోగుల నితర దేశమునుండి యిచ్చటికిఁ దెచ్చినవారెవరు? ఆ వ్యక్తికిగూడ నిచ్చట రక్షాబంధనమును గట్టకున్న నీ దయ్యము వీడిపోదు. వెంటనే వానినిటు తెండు హుం..." అని హుంకరించెను.

ఈ పల్కులకేమియు నర్థముఁ దెలియని సేవకులు పాదుషా కడకు వెడలి విన్నవించిరి. "శివాజీ శంభాజీల నిటకుఁ దెచ్చినది జయసింహుఁడు. వానిని గూడ మాంత్రికుఁడు శోధించినఁ గాని యీ శాంతివ్రతము పూర్తికాదు కాఁబోలు... పొండు... అంబర రాజా జయసింహుని నా యాజ్ఞగా నా మాంత్రికుని కడ హాజరు పెట్టుఁడు"... అని యౌరంగజేబు వారి నాజ్ఞాపించెను..

ఈ వార్త వినిన జయసింహునికిఁ బైప్రాణములు పైకిఁ బోయినవి. తా నొనర్చినదే... పరమద్రోహము... ఇప్పు డా మాంత్రికుఁ డెట్టివాఁడో... ఏమిచేయునో... అచ్చటికి రానన్నఁ బాదుషా యేమి శిక్షించునో... జయసింహునికి భీకరసమస్య యుత్పన్నమైనది... ఔరంగజేబిచ్చిన యాజ్ఞవలన సైనికులు మఱియు వేగిర మొనర్చుచుండిరి. ఏమిచేయుట...

దీనవదనమున... మాతృద్రోహమును బ్రకటించుచు జయసింహుఁడు పదములు బలవంతమున సాగించుచు... మాంత్రికుని సమీపించెను. మాంత్రికుఁడు వానిని జూచుటతోఁ గన్నులనుండి నిప్పులు కురియించుచు మహారాష్ట్రి భాషలో "మహాపాపీ! మాతృదేవతకు మాలిన్యమును గల్గించు నీకంటె పెద్ద దయ్యమీ సృష్టిని గలదే? జాత్యుద్ధారకుఁడగు శివాజీవంటి మహాత్మునిఁ బట్టఁబెట్టు కొనఁగోరు నీ రాక్షసత్వమునకు మించిన రాక్షసత్వమున్నదే.. నిన్ను కాలమే ముక్కముక్కలుగా ఖండింపఁగలదు. నీ పాపభాండమింకను నిండవలయును. రమ్ము... రమ్ము... ఈ మంత్రవేదికపైఁ గూర్చొనుము... నన్నెట్టి మాంత్రికునిగఁ దలఁచితివో...బొందితోఁ బరలోకమున కంపఁగలను... ఛీ–ఛీ– నీచుఁడా! నీవంటి నికృష్టులు భారతాంబకు బిడ్డలు కాఁదగరు.. రమ్ము" అనుచు నింత విభూతిని దీసి వాని మొగమున నూదెను. కండ్లు, ముక్కు, నోరు బూడిదయై జయసింహుఁ డుక్కిరిబిక్కిరి యయ్యెను. ప్రాంతమున సైనికులందఱు నిదియంతయు మంత్రప్రయోగమే యని భ్రమించుచుండిరి. ఇంతలోనా బైరాగి తన సంచిలోనుండి యేదియో యాకును దీసి గుప్పెటఁ బట్టి నలిపి పసరుఁదీయుచు సైనికులతో "ఈతఁడు మహాపాపియో, పుణ్యాత్ముఁడో, యిప్పుడ తెలియఁగలదు. ఇతఁడు దయ్యమును వెంటఁ

దెచ్చెనో, దేవతను వెంటఁదెచ్చెనో నిముసములమీఁదఁ దేలఁగలదు. చూచుచుండుఁడు" అని జయసింహునితోఁ బైదుస్తులఁ దీసి వేయుమని గద్దించెను... జయసింహుఁడు రాజోద్యోగమును జాటు నంగీవిదీసి క్రిందయుంచెను. బైరాగి పసరు నాతని శిరమునిండఁబూసి గట్టిగ మర్దించెను... అది యాకులోని వైలక్ష్యమో... దేవతా శక్తిలోని తత్వమో జయసింహుని పాపమో... తలపై వెండ్రుక లన్నియు వింత నేలరాలిపోయినవి.. బైరాగి బుఱ్ఱవలె నున్నగానున్న తన శిరముపైఁ జేయివైచి చూచుకొని జయసింహుఁడు జీవచ్ఛవమై పోయెను. సైనికు లందఱు నివ్వెఱఁబోయి... తోడనే... పొట్టలు చెక్కలగునట్లు నవ్విరి. శివాజీ శంభాజీలు వచ్చు నగవాపుకొనుటకు బాధపడుచు ముసుగు నింకను బిగించిరి. బైరాగి తన జలకుండికలో నేదియో మంత్రించుచుఁ గలిపి జయసింహునికిఁ ద్రాగించెను. ఐదు నిముసములలో జయసింహుఁడు కన్నులుమూసి మైకమున నేలఁ గూలెను. బైరాగి సైనికుల నందఱ నావలికిఁ బొమ్మని గదితలుపులు బిగించెను.

జయసింహుఁడు మహాపాపి కావున్నదలపై వెండ్రుక లటులూడి పోవని కొందఱును, జయసింహుఁడు ఝరణించలేదుగదాయని కొంద ఱును సైనికులు వీధిలో వివిధములుగా వ్యాఖ్యానించుకొను చుండిరి...

అంతలో... బైరాగి తలుపులు తెఱచి సైనికులతో ఓయీ! మేమీ రెండు మిఠాయి గంపలను పాలిష్వర దేవతకుఁ గానుకనిచ్చి వత్తుము. ఈ లోపున మీరు మిగిలిన మిఠాయిలను బంచి వేయుఁడు... మేము తిరిగి వచ్చువఱకు నెవ్వరు నీ గదిలో నడుగు పెట్టరాదు... ప్రమాదమున నట్లుచేసిన శిరము వ్రక్కలై ఘో

గలదు" అని హెచ్చరించుచుఁ బలికెను... గురుశిష్యు లిద్దఱును రెండుగంపల నెత్తిపై నిడుకొని బైటికివచ్చి గదితలుపులను గొళ్ళెమిడిరి. చూచుచుండగనే వారు రాజవీధిని దాటిపోయిరి. సైనికులు ఫకీరులకు మిఠాయిలను బంచు పనిలో లీనమైపోయిరి... అంతయును గోలాహలమే... అంతయు నడావుడియే...

గంటలు గడచినవి. మిఠాయి లైపోయి ఫకీరులు వెడలిపోవుటతో రాజవీధులన్నియు సందడి తగ్గినవి. సైనికులు బైరాగి రాకకొఱకచ్చట నిరీక్షించుచునే యుండిరి. బైరాగియు శిష్యుఁడును మరలఁ గన్పడరైరి... మైకము తొలగిన జయసింహుఁడు కన్నులను విప్పెను. పర్యంకములపై శివాజీ శంభాజీలు లేరు. తనకు నెత్తిపై వెండ్రుకలునులేవు... తలుపులు తెఱచుకొనియును లేవు. వానికి హృదయములోనుండి బోరుమని ఏడుపు పొంగివచ్చినది. ఏమిచేయవలె... కిటికీయొద్దకువచ్చి సైనికుల నఱచియఱచి పిలిచెను.. కడకు వారు.. భయమందుచు గొళ్ళెమును దీసిరి. అంతయు మాంత్రికమే.. అందఱును మంత్రముగ్ధులే.. ఒకనికి నోటినుండిశబ్దమురాలేదు.. కథయంతయువిపులముగా బోధపడినది..శివాజీ శంభాజీలు గంపలలోఁ బాఱిపోయిరని నగరమంతయుఁ బ్రాకిపోయెను. సైనికులందఱు నశ్వములపై వారి నన్వేషింప నేఁగిరి... యోగి.. మాయయోగి... బైరాగి... ఒకరిద్దఱుకుఁగాదు... అందఱకును దయ్యములు విడిపించెను....

* * * * *

దుర్గాపూజ నొనర్చుచున్న మాతృశ్రీ ముంగిట శివాజీ శంభాజీలు తలలువంచి నమస్కరించిరి. ప్రక్కనున్న బైరాగియు శిష్యుఁడును "జయ్ భవానీ" యని నినదించిరి... తానాజీ యానం

దమున క్షంతములేదు... రాజకోటయంతయు శివాజీ పునరాగమన వార్తతోఁ గమలమువలె వికసించినది. పౌరుల యుత్సాహాతిశయము దుర్గమెల్లెడలఁ దోరణముఁ గట్టుకొనెను... ఎచ్చటఁ జూచినఁ గేరింతలే... ఏచోటు కనుఁగొనిన... జయ్‌భవానీ నినాదములే...

శివాజీ శంభాజీలను యుక్తిగా విడిపించిన బైరాగిచరిత్ర పౌరులజిహ్వాపై నటించినది. అన్నియును బ్రశంసలే... అన్నియును ధన్యవాదములే...

నిండుకొలువున శివాజీ యోగికి ధన్యవాదము లర్పించెను. నిజనామమును వెల్లడించుమని యందఱును బ్రార్థించిరి. అంతయును భగవల్లీల యనుచు నా యోగి వ్రేళులులెక్కించి శివాజీతో "మహారాజా! నేటిరాత్రియే సుముహూర్తము. నా పర్యవేక్షణలోఁ గళ్యాణదుర్గాక్రమణమున కుపక్రమింపుఁడు. చెడ్డగ్రహములు తొలగినవి. రక్తము చిందకుండగనే జయము కల్గును" అని యాదేశించెను... మాతృశ్రీ యాశీర్వదించినది. ఇఁక యోగిగారి యాజ్ఞను దిరస్కరించుట యెట్లు... ప్రత్యక్షముగ యోగిమహాత్వము తెలియుచుండ నెవరు వాని వాక్యమును గాదనఁగలరు ?

కోటద్వారమున రామోజీ వ్రేలుచునే యుండెను...మండప స్తంభమునకుఁ జంద్రరావు బంధింపఁబడియే యుండెను. లక్ష్మి యింటనుపవాసములు చేయుచునే యుండెను... కాళరాత్రి... శివాజీ యనుచరులతోఁ గళ్యాణదుర్గము నాక్రమించెను... నిద్దురమైకమున నున్న ద్వారరక్షకులను బంధించుటతో సర్వము సమాప్తమైనది. అధికార చిహ్నాలు కొల్లలుగాఁ గల యెత్తైన భవనమున నిద్రించుచున్న "అహమదు"ను నిద్రలేపినది 'మనయోగియే"... నవాబు

గారూ! దయచేయుఁడి. దేవుని పిలుపువచ్చినది. నేనే దేవదూతను" అని యతఁ డరబ్బీ భాషలోఁ బల్కరించు సరికి నహామదుకు మతి పోయెను. శివాజీ బంధింపఁ బడెనుగద్దాయను ధైర్యమున నిద్రపోవు చున్న తురుష్కుల చేతినుండి కళ్యాణదుర్గము సునాయాసముగఁ జారిపోయినది... తానాజీ యహామదును బంధించెను... అరుణోదయ మగుసరికిఁ గళ్యాణదుర్గముపై మహారాష్ట్రుల కాషాయపతాక మెగురుచుండెను... శివాజీ కాంతు నిజరూపము నందినది...

* * * * *

శివాజీ దర్బారు... నిందితు లందఱును బ్రవేశపెట్టఁబడిరి. మహారాష్ట్ర వీరుల జయనాదములతో దర్బారు.. మాఱుమ్రోఁగు చుండెను. విజయమును గుఱించియు, యోగిని గుఱించియు శివాజీ యుపన్యసించునని యంద ఱెదురుచూచుచుండిరి. యోగియు దానాజీ ప్రభృతులతో నున్నతాసనమునఁ గూర్చుండియుండెను.

అంతలో నొక దీనకంఠము... "పతిభిక్ష పతిభిక్ష" యని వినవచ్చినది. అందఱి దృష్టులు నటు మఱలినవి. లక్ష్మి... కన్నీరు మున్నీరుగానేడ్చుచు... తిన్నగా మాతృశ్రీకడకేఁగి పాదములపైఁ బడెను. నిందితులలోఁ జేతులువెన్కకు విఱిచికట్టఁబడియున్న చంద్ర రావు నిల్ువున నభిమానమున భూమిలోనికిఁ గ్రుంగిపోయెను.

మాతృశ్రీ లక్ష్మిని లేవనెత్తి "అమ్మా! నీ పతి యెంత దుర్మార్గుండయ్యును భవానీ కరుణచే విడువఁబడుచున్నాఁడు. ఐదువ తనమందలి ప్రశస్తిని గుర్తించిన భారతీయులెవ్వరు నట్టి కష్టమును జేచేతులఁ గల్పింపరు. తానాజీ! చంద్రరావును వదిలింపుము. వానికీ శిక్ష చాలును. ఇకనైన నాతఁడు భవానీ కృపకుఁ బాత్రుఁ డగునట్లు ప్రవర్తించును గాక..." అని యనునయముగఁ బల్కెను.

తానాజీ చంద్రరావును బంధములనుండి విడిపించెను. చంద్రరావు మోమును బైకెత్తలేదు.

అంతయు విభ్రమము... అంతయు విభీకరము. ప్రక్కవీరుని యొరనుండి ఖడ్గమును లాగుకొని చంద్రరావు సాహసమునఁ దన వక్షస్థలమునఁ గ్రుచ్చుకొనెను. లక్ష్మి కెవ్వునఁ గేకవైచెను. ఆత్మహత్య... ఆత్మహత్య... అందరు నివ్వెఱవోయి నిశ్శబ్దమై పోయిరి. రక్తమునఁ దోప్పఁదోఁగుచున్న చంద్రరావు భవానీ పాదములకడకుఁ బర్వెత్తి "భవానీ! పాపిని రక్షింపుము... రఘు విరోధి... లక్ష్మి యమాయకురాలు... అందఱను హింసించిన దే...శ...ద్రో...హి...ని...క్ష...మిం...పు...ము" అనుచుఁ గ్రిందఁబడి ప్రాణవాయువుల వీడ్వైచెను. వాని పాదములకడ లక్ష్మి.

"ఇది యేమి దృశ్యము... స్వామీ! దీనికేమేని యనర్థముండునా ?" అనుచు శివాజీ యుద్వేగమున యోగివైపునకుఁ జూచి ప్రశ్నించెను. ఆశ్చర్యము... ఆసనమున యోగిలేఁడు... ఆ కషాయదుస్తులను దొలగించి రఘు... శివాజీ తన కన్నులను దానే నమ్మలేకపోయెను. సభయంతయు నొక్కసారిగ హర్షమున... "రఘుబాకు జయ్" యని ధ్వనించెను.

కాని రఘు... ఉత్సాహములేదు. లక్ష్మికిఁగల్గిన కుంకుమ విచ్ఛిత్తి కాతఁడు మనస్సులోనే రోదించెను. మెల్లగా లక్ష్మి వైపునకు వెడలెను. సభలోనివారందఱీ విచిత్రకథను బ్రశంసించుకొనుచుఁ దనువులు మఱచిరి. రఘు... స్థితప్రతిజ్ఞుఁడు... కాని వాని కన్నులముందే లక్ష్మి సహగమన మొనరించుట వాని గుండెకు నారని మంటయైనది.

* * * * *

విచిత్ర కాలమున వింతశోభ రూపొందెను...

నాఁడు భారత వాసులకు మహా పర్వదినము... ఉగాది.. ప్రకృతి యంతయుఁ బలువిధముల శృంగారించుకొన్న శుభ సమయము. ఎచ్చోట జనార్ధన గురుదేవులు పరమ తపమును సాగించిరో, ఎచ్చోట కళాదేవత విశ్రమించినదో, ఎచ్చోట రఘూబాలవంటి వీరాధివీరులు నవ్య చైతన్యమునందిరో... ఆ పరమ పవిత్రమైన "శాంతినికేతనము" పునరుద్ధరింపఁబడినది... పచ్చని తోరణములమధ్య.. విచిత్రరంగవల్లులుగల వేదికపై కోయిలకూజితముల నడుమ, భృంగముల ఝుంకార నినాదముల, జనార్ధన గురుదేవుల విగ్రహావిష్కరణము సమంత్రకముగ సరయూ రఘూబాల కళ్యాణము... జరిగినది... శివాజీ స్వామ్యముగ నేఁడు శాంతినికేతన ప్రాంగణమున జాతీయ పతాకము నెగురవైచుచు "భారత భూమియే శాంతినికేతనము. అందునప్పటప్పటఁ బ్రవేశించు దానవసైన్యము సంహరింపఁబడుచుండుగాక. శాంతినికేతనము గురుదేవుల యాదర్శమునకుఁ బ్రతిబింబమగుఁగాక.. నవ్యభారతము సత్యశాంత్యహింసల యవలంబనమున నుజ్జీవ మందునుగాక...భారతీయుల యాత్మీయ స్వాతంత్ర్యము స్థిరమైనిలుచునుగాక"... అనుచు నుపన్యసించెను... నవభారతప్రశస్తి... గురుదేవుల కశ్రుతర్పణము...నూత్న దంపతుల నాశీర్వదించుట...నాటివీరులకు మహోత్సాహమునుగల్గించెను... శాంతినికేతన మనవరత మిచ్చు దివ్యసందేశము...

"స్వధర్మేని ధనంశ్రేయః పరధర్మో భయావహః"

జయ్ భవానీ

స్వస్తి

తెనాలి భారతీప్రెస్సున ముద్రితము 1953

